# శ్రీ హనుమద్వ్రతజయంతి ప్రదక్షిణ కల్పము



గ్రంథకర్త

మంత్రశాస్త్ర ప్రవీణ – హనుమద

బ్ర॥ శ్రీ॥ శిష్ట్లా చంద్రమౌ



వెల రు. 25.00



గ్రంథకర్త

మంత్రశాస్త్ర ప్రవీణః హనుమదుపాసకః

బ్ర॥ శ్రీ శిష్ట్లా చంద్రమౌళి శాస్త్రి

పెదపాడు (S.O.) ప॥ గో॥ జిల్లా

శ్రీ శివాయ గురవేనమః

# పండితాభిప్రాయములు

"వసంతవల్లోకహితం చరంతో వసంతి సంతః" అనునట్లు సజ్జనులు, లోకోపకారకరణపరాయణులు నైన శ్రీ శిష్టా చంద్రమౌళిశాస్త్రిగారు గురుకటాక్షలబ్ధ మంత్రోపదేశ తదనుష్ఠానములచే తాము కృతార్థులగుటయేగాక, లోకహితమునాకాంక్షించుచు, తమ మంత్రశాస్త్ర పాండిత్యమును తదనుష్ఠానప్రావీణ్యమును పురస్కరించికొని, అనేకానేకగ్రంథముల నుండి సంగ్రహించి వ్రాసిన గ్రంథములు ననేకములు.

వీరు హనుమద్బ్రహ్మోపాసకులగుట, తన్మంత్ర రహస్యములు, తద్భేదములు, తదనుష్ఠానక్రమ, నియమములు తదనుకూల యోగ్యదేశకాలాదులు వివరించుచు నీ గ్రంథములు రచింపబడినవి. వానిలో నీ శ్రీ హనుమద్వ్రతజయంతీ ప్రదక్షిణ వ్రతకల్పము, హనుమద్భక్తుల కత్యంతోపకారకమై విలసిల్లు ననుటలో నెవ్వరికిని విప్రతిపత్తి యుండజాలదని నా దృఢవిశ్వాసము.

సహస్రపూర్ణ చంద్రదర్శన మొనరించిన వయోవృద్ధులయ్యు లోకోపకారబుద్ధితో నిట్టి గ్రంథముల ప్రకటించు నీమంత్రశాస్త్ర ప్రవీణుని హనుమద్బ్రహ్మము ఆయురారోగ్యైశ్వర్యాదు లొసంగి, యింకను నిట్టి గ్రంథగ్రథన శక్తి

యుక్తుల నొసంగుగాక యని శ్రీ యాంజనేయస్వామిని ప్రార్థించుచున్నాను.

ఈ గ్రంథమును జదివి తా ముపకృతినంది భక్తవరులు పరోపకారపరు లగుదురు గాక.

ఓం తత్సత్

ఏలూరు
30-4-8

సాహిత్యవిద్యాప్రవీణ, విద్వాన్
ఇంద్రకంటి సూర్యనారాయణమూర్తి



శ్రీ గురదేవతః

# కాంశోక్తి

శ్లో॥ శో నామ బ్రహ్మ తస్యాంశో హృదయాకాశ ఈరితః
తదుక్తిరపి కాంశోక్తి రంతర్వాణీతి కథ్యతే ॥
క కారః కలగోపాఖ్య శ్చాంజనేయ స్తథైవ చాం
శాస్త్రీ శ కార ఇత్యుక్తః కాంశోక్తి స్తస్య వాగ్ఝరీ ।

## వాయభిప్రాయము

మంత్రశాస్త్ర ప్రవీణ, హనుమదుపాసక, బ్రహ్మశ్రీ శిష్టా చంద్రమౌళి శాస్త్రులవారికి

సౌమ్య శ్రీ స్వామ్యమృతానందతీర్ధ కలగ ఆంజనేయ శాస్త్రి తద్వాని నమస్కారములు.

అయ్యా !

తాము పంపిన శ్రీ హనుమ న్మంత్రానుష్ఠానప్రకాశిక 2. శ్రీ హనుమద్వ్రత జయంతీ ప్రదక్షిణకల్పము, హనుమ త్సేవామాహాత్మ్యము యథామతి పరికించితిని అందు మొదటిది 428 పుటలు. రెండవది ౫౧౪ పుటలు కలిగి లోకమునం దున్న హనుమ దుపాసకుల కత్యంతోపయుక్తములై యున్నవి.

ఇంతకుముందు తమచే ప్రకటింపబడిన తమ గ్రంథములలో సుందర హనుమద్వైభవమను గ్రంథమును నేను నా నిత్యానుష్ఠానమునం దుంచుకొని బ్రహ్మానందము నొందుచున్నాను. నాటికిని నేటికిని తాము చేయుచున్న కృషి యందలి స్వారస్యము సామర్థ్యము వర్ణనాతీతమై వృద్ధావ్య

ముఖందున్నైత మత్యంతాభివృద్ధినొంది సురసన్నిధిని హనుమద్దేహమువలెను రావణసన్నిధిని హనుమంతుని తోకవలెను పెరిగి దేశ కాల పాత్రానుసార మధికారి తారతమ్యము ననుసరించి సంకోచ వ్యాకోచముల నిగ్రహానుగ్రహసమర్థములై యున్నవి.

ఇందునుగురించి వాస్తవమును స్వభావోక్తిని జెప్పవలెనన్న

"ఆనగ ననగ రాగ మతిశయిల్లుచునుండు

తినగ తినగ వేము తియ్యనుండు" అని యున్నట్లు

సర్వదా భగవంతుని నామమును అనగ ననగ అహం బ్రహ్మస్మ్యహం బ్రహ్మాస్మి" యని స్వరూపానుసంధానమునుచేయగా చేయగా భగవంతునియందు అనుసంధానాత్మకమైన భక్త్యనురాగము లభివృద్ధి నొందును. అట్లే ముముక్షుదశ యందు వైరాగ్యదృష్టిని ముందు వెగటుగ దోచిన విషయ ప్రపంచ మంతయు బ్రహ్మాభ్యాసమున "సర్వం ఖల్విదం బ్రహ్మ" అను వాక్యానుసారము పరబ్రహ్మాకారమై తోచి మధుబ్రహ్మవిద్యను మధురాతిమధురమై యుండు నన్నట్లు తమ హనుమ త్సారస్వత మంతయు తదుపాసక లోకమునకు కొంగుబంగారమై యుండునని నా నిశ్చయాభిప్రాయము.

ఇతి సర్వం శివమ్

ఓం తత్సత్

అమృతానంద విద్యాపీఠం
సత్యనారాయణపురం
విజయవాడ 11 (కృష్ణా)
ది. 24-4-1981

సౌమ్య శ్రీ
కలగ ఆంజనేయశాస్త్రి తద్వివి

# వి ష య సూ చి క

## ప్ర థ మ భా గ ము

## ద్వితీయ భాగము

## పంచమ భాగము

ఓమ్

శ్రీ సువర్చలాసహితాంజనేయాయ నమః

శ్లో, శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం।
ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వవిఘ్నోపశాంతయే.

—♦ ఇష్టదేవతా ప్రార్థన ♦—

శ్లో. సీతారాఘవదత్తమౌక్తికలసద్ధారావళీ శోభితం, హస్తాంభోజవరాభయాంకిత మనేకాకల్పరత్నోజ్జ్వలం.వాలావేష్టితమౌళి మీశ్వరతనుం భక్తానుకల్పద్రుమం, రాజన్మౌంజ్యజినోపవీత మనిశం శ్రీ ఆంజనేయం భజే.

—♦ గురు ధ్యానమ్ ♦—

శ్లో॥ విజ్ఞాతసర్వాగమతత్త్వమూర్తిం। నివారితాంఘ్రిప్రణతాఖిలార్తిం। జంధ్యాలవంశోద్భవ మానమామి।శ్రీసూర్యనారాయణదేశికేంద్రమ్,

—♦ మాతా పిత్రాదిక ధ్యానమ్ ♦—

శ్లో॥ శ్రుత్యుక్తకర్మాచరణ ప్రపూతం। విద్యోపదేశోద్ధృతశిష్యవర్గం। ప్రసిద్ధశిష్టాన్వయరత్నదీపం। గోపాలకృష్ణం పితరం ప్రపద్యే.

శ్లో॥ తామాదిలక్ష్మీపదకీర్తనీయాం। పతివ్రతానాం పురతోభిధేయా। లక్ష్మీసమానాం సుగుణావదాతాం। వందే మదీయాం జననీం శుభాప్త్యై

శ్లో॥ అష్టాదశాఽప్యనుపమాన్ ప్రథితాగ్రహారాన్। సంపాద్య పూర్వ మిహ మంత్రజపప్రభావాత్॥ కీర్తింనిజామకలయత్కిలయస్సమర్థ। స్తం సాధుమత్పితృపితామహావర్గమీడే

అయం గ్రంథః శిష్టోపనామకగోపాలకృష్ణ దైవజ్ఞద్వితీయసూనునా చంద్రమౌళిశాస్త్రిణా ప్రకటితస్సన్ విజయతే.

# శ్రీ హనుమద్భక్తుల కొరక విజ్ఞప్తి

సువర్చలాసమేత హనుమద్భక్తులారా ! సర్వదేవాంశ సంభూతుడును సకలదేవతా స్వరూపుడును త్రిమూర్త్యాత్మకుడును భక్తమనోరథపూరకుడునగు అంజనాపుత్రు నిచరిత్రము లోకవిదితము. ఇట్టి మహానుభావుని జన్మోత్సవము - అనగా : జయంతి, వ్రతము, ప్రదక్షిణావిధానము మొదలైనవి మన దేశమునం దచ్చటచ్చట భక్తులెల్లరు ఆచరించుచునే యున్నారు. కాని అందులో నెందరో విధ్యుక్తరీతి నాచ నాచరించుచునే యున్నారు. జనసామాన్యమునకు విధివిధానము సరిగా తెలియునని తోచదు. కారణ మేమన మామూలుగా వాడుకలోనున్న వ్రతపురాణాదులయందును జననము మొదలైన విషయములు ఆమూలాగ్రముగా లేనిహేతువు చేతను మంత్రశాస్త్రసంబంధమైన తాళపత్రగ్రంథములయందు రహస్యముగా నుండుటచేతను సర్వులకు తెలియకపోవుచున్నది. **14-4-1934** వ సం॥ ఈజయంతి, వ్రతము, ప్రదక్షిణములు మొదలగువానిని గురించి ప్రచారముచేసి రామజయంతి, కృష్ణజయంతి శంకరజయంతి మొదలగు జయంతులరీతిగా హనుమజ్జయంతి బాగుగా వెల్లడియై, సర్వులు ఆచరించు కోరిక కలవారమై హనుమదాలయములుగల పెద్ద పెద్ద పట్టణములయందు ఉపన్యాస రూపముగా ప్రజలకు బోధచేయు తలంపుతో అనేక పట్టణములకు వెళ్ళి అచ్చట పెద్దలుగానున్న కాలేజీ పండితులలో ప్రధానులగు మహామహోపాధ్యాయ మొదలైన

బిరుదములు వహించిన బ్రహ్మశ్రీ తాతా వెంకటసుబ్బారాయ శాస్త్రులవారిని దర్శించి, వారితోను మరికొంతమంది పెద్ద మనుష్యులతోను ఈ హనుమజ్జీవితమును గురించి ఉపన్యసించెదనని మనవిచేసి అయనో నేనువద్ద వేంచేసియున్న ఆంజనేయుని ఆలయమువద్ద శ్రీ సుబ్బారాయశాస్త్రులవారి ఆధిపత్యముక్రింద సభ జరిపి యుంటిని. ఆసభామధ్యమందు శ్రోతలకుగల సందియముల కొన్నిటిని నన్ను ప్రశ్నించిరి. నా శక్తికొలది వారికి సమాధానమిచ్చితిని. అందుముఖ్య ప్రశ్నము 'ఆంజనేయమూర్తి వివాహితుడు కాడనియు సూర్యునివద్ద విద్యల నభ్యసించు సమయమున ఆంజనేయమూర్తి సూర్య పుత్రియగు సువర్చలను వివాహమాడినట్లు చెప్పిన వాక్యములు సమ్మతములుకావనియు గురుపుత్రిని గ్రహించుట అశాస్త్రీయమనియు' మొదలైన సంగతులను ముచ్చటించిరి. అందులకు నేను చెప్పినవిషయముల ననుసరించి సభాసదులలో పండితులు తద్విషయమును సిద్ధాంతీకరించుచు గురుపుత్రి యను శబ్దమునకు అనేక అర్థములుకలవనియు నేను చెప్పిన విషయములు సశాస్త్రీయములనియు వ్రాసిచ్చియున్నారు. తదుపరి గతసంవత్సరము ఈ హనుమజ్జయంతి వ్రతాదులనుగురించి మద్రాసునందు ఉత్తరాదిమఠమనే పేరుగల మధ్వాపీఠమునందును ఉపన్యాసము జరిగెను. తరువాత మద్రాసుహైకోర్టు ప్రధాన న్యాయమూర్తులగు సర్ వేపా రామేశం పంతులుగారి అధ్యక్షత క్రింద తిరిగి ఉపన్యాసమిచ్చితిని. నెల్లూరు తాలూకా ఉదయగిరి యందు సబురిజిష్ట్రారుగా పనిచేయుచున్న గాడె పద్మనాభంగారు మొదలగు వారియెదుటను పై

విషయములనుగూర్చి ఉపన్యాసమిచ్చితిని. ఏలూరులో వాసు దేవాలయము నందును ఉపన్యాసములు జరిగెను గాని నాకు గల కొద్ది అనుభవములో ప్రతిస్థలమందును పెక్కుమందికి ఈహనుమన్మూర్తిని గురించిన సందియములు పెక్కులు గల వని గ్రహించినవాడ నగుటచేతను అనేకమంది హనుమద్భక్తులు శ్రీస్వామివారి పూజావ్రతాదులు మొదలైనవి గ్రంథరూప మునా వెల్లడి చేయుమని కోరినందునను నాకు మా పెద్దల వలన తెలిసినంతవరకు మంత్రశాస్త్ర సంబంధమైనటువంటియు హనుమదుపాసనకు ప్రధాన మైనటువంటియు సంహితలను కొన్నిటిని సంగ్రహించి శ్రీ స్వామివారివ్రతము జయంతి ప్రదక్షిణములు మొదలైనవి సప్రమాణ వచనములతో సర్వు లకు తెలుపవలె నను కోరికకలవాడనై యీ గ్రంథరూపమున లోకమునకు వెల్లడించుచున్నాను. ఇందు పొరపాటు లనేకము లుండవచ్చును. చదువరులు అట్టిపొరపాట్లుగాని యే యితర విషయములుగాని సశాస్త్రీయములుగా నుండి నాకు తెలిపిన యెడల అవి నాచే వ్రాయబడనున్న హనుమద్విషయకమైన గ్రంథములందు ప్రకటింతును, గాన భక్తులెల్లరు ఈ వ్రతా దుల నాచరించి ఇష్టసిద్ధుల నొంది హనుమత్సాయుజ్యము నొందుదురుగాక !

## గ్రంథరచనా ప్రశస్తి

మహాశయులారా! సమస్త ప్రాణిజాలమును ఇహము నందును పరమునందును సుఖమునే యభిలషించును. అట్టి సుఖము విహితకర్మానుష్ఠానము చేతను నిషిద్ధకర్మపరిత్యాగము

చేతను సంభవించును. విహితకర్మానుష్ఠానమనునది కాయిక వాచిక మానసిక దోష రాహిత్యముగను అనుష్ఠింపబడిననే సఫలమగును. సామాన్యముగ కాయిక మానసిక దోషము లనబడు ఆధివ్యాధులచే పీడింపబడనివా రరుదు. అట్టి ఆధి వ్యాధులు విహితకర్మానుష్ఠానమునకు ప్రతిబంధకములు, గాన ఆధివ్యాధులుకలవారలు సత్కర్మానుష్ఠానాసమర్థులగనుకతత్ఫల మగు ఐహికాముష్మిక సుఖములను పొందజాలరు. ఆదివ్యాధు లను తొలగించుకొనినచో సత్కర్మల నాచరించి తత్ఫలమగు సుఖమును బడయగలరు. ఆధివ్యాధులన్ననో సామాన్యమైనవి కావు. ఆధియన, మనోవికారము. అయ్యది భూతప్రేతపిశా చాది దుష్టగ్రహావేశమువలన గాని ఇష్ట వస్తువుయొక్క అలా భమువలనగాని భ్రాంత్యాదులవలనగాని సంభవించును. అట్టి చిత్తవికారమును ఉపాయాంతరములచే పోగొట్టుకొనుట దుర్ఘ టము. యోగాభ్యాస రూపమగు ఉపాయమున్నను అయ్యది సంప్రదాయపరిభ్రష్ట మగుటచే సులభముగ ననుష్ఠించుటకు శక్యమైనదికాదు. వ్యాధులన్ననో శరీరమునకు వికృతిని సంపా దించి తద్ద్వారా దుఃఖకరములుగాన కాయికము లనబడును. అట్టివ్యాధులు కుష్ఠాపస్మారాదులని తద్భేదములు చరకసంహి తాది గ్రంథములయందు విపులముగ వర్ణింపబడినవి. ఆవ్యా ధులు సామాన్యముగ నూటికి తొంబదివంతులు అసాధ్యము లనియే చరకసంహితయందు వర్ణింపబడినవి. ఐనను తాత్కాలి కోపశాంతికొరకు చికిత్సలును చెప్పబడినవి. అట్టి చికిత్సలు ఓషధీ సంప్రదాయము ననుసరించియు రసాది సంప్రదాయము

ననుసరించియు ద్వివిధములుగ నున్నవి. అందు ఓషధులు హిమవద్వింధ్యాది మహాపర్వత ప్రాంతములయందు ఉత్పన్నమైనవియేః వ్యాధి నివారకములనియు ఆ యోషధులను సంప్రదాయానుసారముగ గుర్తించి కాల విశేషమునందు సంగ్రహించి వాడవలెననియు నిర్ణయించబడినది. ప్రకృతమున్ననో మనకు అట్టి ఓషధులే దొరకుటలేదు. 'కాకోళ్యాదిగణము జీవంతి కాదిగణము సోమలత జ్యోత్స్నలత సుదంతీలత' మొదలగు ఓషధిరాజములు మహాపర్వత ప్రాంతములయందును దృష్టిగోచరములు అగుటలేదు. యథాసంభవమగు స్వల్పౌషధులైనను దేశకాలనియమము లేక సంగ్రహించబడిన వగుటవలన నిస్సారముగనున్నవి. రససంప్రదాయమున్ననో రసవిషగంధకములు అష్టాదశసంస్కారములచే సంస్కరింపబడిననేగాని నిర్దుష్టమై ఫలజనకము కానేరవు. అట్లు గాకపోవుటయేగాక అపరిశుద్ధతవలన నితరవికారములను గూడ కలిగించుచున్నవి కనుక ఆధివ్యాధులకు చెప్పబడిన ఉపాయములచే ఆత్యంతిక నివృత్తిదుర్లభము. అట్టి ఆదివ్యాధులను సుకరముగ అత్యంతము నశింపజేయుటకు సాధనమును అన్వేషించుటకు యత్నము చేయవలసియున్నది. ఈనాచే ఉపదేశించబడు సాధనము ప్రతిగ్రామమునందును ప్రతిమతమునందును ఆబాలగోపాలమునకు విదితము. అట్టిసాధన మేమనగా : శ్రీసువర్చలాసమేతహనుమత్ప్రదక్షిణపూజానమస్కారములు మొదలగునవి. సామాన్యముగా ఆస్తిక దేశమగు మన భరతఖండమునందు ఆంజనేయాలయము రామాలయము లేని గ్రామమే లేదు. ప్రతిగ్రామము

సందును చిన్నదియో పెద్దదియో కలయమును నిర్మించి యందు శిలావిగ్రహమునుగాని పటమును గాని ప్రతిష్ఠించి భక్తిపూర్వకముగా ఆచండాలాంతము ఏకమత్యముతో ఆస్తిక బుద్ధితో శ్రేయస్సు నభిలషించి సేవించుచున్నారు. ఆంజనేయ విగ్రహముగాని పటముగాని ఆంజనేయస్మరణగాని లేని ప్రతి గ్రామమునందును శ్రీరామాజ్ఞచే రాక్షసులు భూతప్రేత పిశాచాద్యావేశరూపముగా మానవులను భక్షించుచుందు రనియు శ్రీ ఆంజనేయపూజాదులచేగాని స్మరణమాత్రముచే గాని భక్తితో ఆంజనేయు నుపాసించువారలకు అట్టిబాధలు తొలగిపోవుననియు అనేక ప్రమాణములు కలవు. వానిలో కొన్నిటి నుదాహరించుచున్నాను. శిలసంహితయందు ఈక్రింది విధముగా చెప్పబడి యున్నది.

శ్లో॥ మమ పార్శ్వగతా వీరా రాక్షసాః పిశితాశనాః॥ యాచంతే జానకీనాథం నరభోజనమేవ చ॥ ఇతి శ్రుత్వా రామచంద్రః అబ్రవీ జ్జానకీపతిః। ఆంజనేయం వినా యత్ర తత్ర భక్షంతు మానవాన్.

తా॥ మాంసభక్షణయందు ఆసక్తిగల రాక్షసులు, తమకు నరభోజనముకావలెనని శ్రీరామచంద్రుని కోరగా ఆసమయమునందు రామచంద్రమూర్తి ఆరాక్షసులను జూచి ఆంజనేయ విగ్రహముగాని తత్స్మరణముగాని యేగ్రామము నందుగాని యేగృహమునందుగాని లేదో అచ్చటమనుష్యులను భక్షింపుమని ఆజ్ఞయిచ్చెను. ఇట్లు ఆజ్ఞయిచ్చి తక్షణామే హనుమంతునితో ఇట్లు పలికెను.

శ్లో॥ గచ్ఛ శీఘ్రం మహాభాగ కురు రక్షోవిదారణం।
హే కపే విశ్వాం కపిశ్రేష్ఠ రక్షోగణవిదారణ.

తా॥ ఓ ఆంజనేయా! నీవు శీఘ్రముగ గ్రామముల యందు నివసించి రాక్షసులను నశింపజేయుము. నేను రాక్షసులకు బ్రహ్మోక్త ప్రకారముగా వరమునిచ్చియుంటిని. నీవు లేనిచో రాక్షసులు మనుష్యులను బాధింతురు గనుక విశ్వమును రక్షింపుము. అనిన—

శ్లో॥ ఇత్యేతద్వచనం శ్రుత్వా రామదూత స్సుబుద్ధిమాన్। తదారభ్య దివారాత్రం రక్షన్ సర్వం చ రాష్ట్రకమ్।

తా॥ ఈప్రకారముగా పలికిన రామచంద్రునియొక్క వాక్యములను విని సర్వభూతదయాపరుడగు హనుమంతుడు అప్పటినుండియు దివారాత్రములయందు తనధ్యానాదికము చేయు భక్తులను సంరక్షించుచు సర్వరాష్ట్రములయందు నిండియుండెను. ఇట్లు అనేకములగు ప్రమాణములు తాళపత్రాదులయందును సుదర్శనసంహిత శౌనకసంహిత హనుమచ్ఛాబరచింతామణి యను గ్రంథములయందు అనేకము లున్నను గ్రంథవిస్తరభీతిచే సంగ్రహముగ నుదాహరించితిని. సామాన్యముగ పూజావిధానమని సమష్టిరూపముగ చెప్పబడు పూజావిధానము సాంగోపాంగముగ కల్పోక్తప్రకారముగ నాచరించబడినయెడల ఆధివ్యాధిరూపము లగు సమస్తదుఃఖములు నివర్తించును. చిత్తస్వాస్థ్యము కలుగును. స్వస్థచిత్తులై సత్కార్యానుష్ఠానముచే ఐహికాముష్మిక సుఖములను బడయగలరు.

ఇందుకు 'హనుమచ్ఛాబరచింతామణి' యను తాళపత్రిగ్రంథ మునందుగల ప్రమాణవచనముల నుదాహరించుచున్నాను.

శ్లో॥ ఆంజనేయమను ర్లోకే శంకరేణ ప్రకాశితః।భూత ప్రేతపిశాచాద్యా శ్శాకినీబ్రహ్మరాక్షసాః। దృష్ట్వైవ ప్రప లాయంతే మంత్రానుష్ఠానతత్పరమ్.

తా॥ ఆంజనేయమంత్రము శంకరునిచే ప్రకాశింపచేయ బడినది. అట్టిమంత్రము నుపాసించువానిని చూచుటతోడనే భూత ప్రేతపిశాచాదులు పారిపోవును.

శ్లో॥ భూతిం జలం మూలికాం చ హనుమన్మనునా ప్రియే । మంత్రయిత్వాతు దాతవ్యం రోగశాంత్యర్థమేవ చ.

తా॥ ఆంజనేయమంత్రముచే నభిమంత్రించబడిన విభూతి గాని ఉదకము గాని ఔషధము గాని సేవించినయెడల తత్క్ష ణనే సమస్తవ్యాధులు తొలగిపోవును.

శ్లో॥ వజ్రవల్లీం సమాదాయ విదద్యా ద్వైష్ణవీదినే । విసృజ్య గ్రంథిదేశం తు సూక్ష్మం చూర్ణం తు లేపయేత్ ॥ బిడాలపదమాత్రం తు మంత్రితం శతశః ప్రియే।శర్కరాఘృత సంయుక్తం భక్షయేచ్చ ద్విపంచకమ్॥ అశీతివాతా నశ్యంతి యే యే దారుణసంభవాః । మాసద్వయేన ముచ్యంతే నాత్ర కార్యా విచారణా.

తా॥ వజ్రవల్లిని (నల్లేరును) విష్ణుప్రియమగు ద్వాదశి యందు సంగ్రహించి కణుపులను విడచి మిగిలినభాగమును

చూర్ణించి హనుమన్మంత్రముచే నూరుపర్యాయములు అభి మంత్రించి కొద్దిచూర్ణమును శరీరమునకు లేపనముజేసి మిగత చూర్ణములో మూడుబ్రేళ్ళకు వచ్చిన చూర్ణమును పంచ దారా ఆవునేతులతో కలిపి పదిభాగములుచేసి ఒకరోజు సేవించు పద్ధతిని రెండుమాసములు సేవించినయెడల అతిదారుణములగు అకాలవాతములు నివారించును. ఈఔషధమును సేవించునప్పుడు ఆంజనేయుని సభక్తికముగ హృదయమునందు నిలిపి నిత్యము ఆంజనేయమంత్రమును గాని కవచమును గాని మాలామంత్ర మును గాని మొదలైనవి పఠనచేయుచుండినయెడల నిస్సం శయముగ ఫలము కలుగును. ఇట్టి చికిత్సలే ప్రతివ్యాధికిని హనుమన్మంత్రసంపుటిచే చెప్పబడి యున్నవి. ఇందు ఇట్టి పరమహంసక్రియలను వెల్లడిచేయుట అశాస్త్రీయము గనుక ఉదాహరణముగ కొన్నిటిని నిరూపించి యున్నాను.

ఆంజనేయమంత్రోపాసన యనునది ఉత్తమాధికారు లకు తన్మంత్రజపము హోమము తర్పణము మార్జనము ద్విజ భోజనము అని కల్పములయందు చెప్పబడియున్నది. శౌనక సంహితయందు-శ్లో॥ జపో హోమ స్తర్పణం చ మార్జనం ద్విజభోజనం।పంచాంగోపాసనం ప్రోక్తం ప్రవదంతి మనీషిభిః. మధ్యమాధికారులకు విగ్రహపూజా ప్రదక్షిణ నమస్కార ములు, అశక్తులగు మందాధికారులకు తద్దేవతాదర్శనతన్నామ స్మరణములు ఇట్లు నియమముగ సభక్తికముగ ఆంజనేయ దేవు నుపాసించుటచే ఆధివ్యాధులు నశించుటయేగాక సమస్తా భీష్టకార్యసిద్ధులు కలుగును. ఇందుకు పరాశరసంహితయందు

గల ప్రమాణవచనము వ్రాయుచుంటిని. శ్లో॥ యద్య దిష్ట తమం లోకే త త్తత్సిద్ధి ర్నసంశయః॥ ఇట్టి భ క్తకల్పతరువగు ఆంజనేయదేవ్రని మంత్రానుష్ఠానము మొదలై నవానియందు దైవ గురుభ క్తి కలిగిన బ్రిహ్మ క్ష త్రియ వైశ్య శూద్రు లగు చాతుర్వర్ణ్య స్త్రీపురుషులకు బాలవృద్ధులకు అజ్ఞ విజ్ఞులకు త త్తద్వర్ణవిహితరీతిని అర్చనాదికమును గాని కాలశుద్ధిని గాని విచారింపకయే శ్రేయోభిలాషులగువారు తన్మంత్రానుష్ఠాన మునుగాని తద్విగ్రహపూజనముగాని ప్రదక్షిణములనుగాని తద్ధ్యానమునుగానిచేయుటకు అర్హత కలిగియున్నారు. ఇందుకు ప్రమాణవచనములుగలవు. గాలు డనుకిరాతుడు కుష్ఠవ్యాధిచే పీడింపఁబడి పుష్కలుడను మహర్షి నాశ్రయింపగా నామహర్షి హనుమన్మంత్రమును కిరాతునకు ఉపదేశించు విషయములో సందేహముకలవాడై తదిష్టదైవమగు ఆంజనేయమూ ర్తి వలన తనకుగల సందియముబాపుకొనదలచి హనుమంతుని ధ్యానించి ప్రత్యక్షము చేసికొని తనకుగలిగిన సందేహమును బాపుకొని ఆంజనేయాజ్ఞచే తన్మంత్రమును కిరాతున కుపదేశించి అతని కుష్ఠవ్యాధి నశింపజేసెను. ఈ అర్థమును ప్రతిపాదించు హనుమ దాజ్ఞా వాక్యముల నుదాహరించుచున్నాను ॥శ్లో॥ గాలోయం మృగయుర్నీచః కథం మంత్రస్య తే ప్రభో। యోగ్యోయ మితి సందేహో బాధతే మా మహర్నిశమ్॥ హనుమద్వాక్యము:- శ్లో॥ కపీంద్ర స్తమువాచాథ మా కురుష్వాత్ర సంశయం। మన్మంత్రజాలవిషయే మద్భ క్తేష్వయ్యపి ద్విజ॥ ఉపదేశగురౌ చాపి భ క్తిరేవాత్ర కారణమ్। శూద్రోవా విప్రకీర్ణోవా

షైశ్చోక్త్వా తృతీయోపివా।మన్మంత్రవిషయే సర్వేషాంత్రతాన్యేవ న సంశయః॥

ఈప్రకారము పరాశరసంహితయందు చెప్పబడి యున్నది. కనుక హనుమన్మంత్రము నుపాసించుటకు సర్వులు అర్హతకల వారై యున్నారు. ఈహనుమదుపాసనచే అగస్త్యులు పరాశరులు మైత్రేయులు భీముడు అర్జునుడు గాలుడు పుష్కలుడు ధ్వజదత్తుడు సోమదత్తుడు యువనాశ్వుడు విశ్వామిత్రుడు భరతుడు దేవేంద్రుడు హరిశర్మయను విప్రపుంగవుడు సీతాదేవి ద్రౌపది మొదలుగా గలవారలు వారివారి అభీష్టములను పొందినవిషయములు హనుమద్దైవాహికవిషయ నిర్ణయమునకు తగిన సప్రమాణమగు శ్లోకరూపమైన ఉదాహరణలతో హనుమద్వైవాహమాహాత్మ్యమునందు వ్రాయబడినవి. ఈ గ్రంథమునందు హనుమన్మాహాత్మ్యము హనుమద్వ్రతము చేయుటకు యోగ్యమైన మాస తిథ్యాదులనిర్ణయము పూజావిధానము అష్టోత్తరశతనామావళి సహస్రనామావళియు ఆంజనేయుని వ్రతమువలన అభీష్టములను పొందిన భక్తులయొక్క కథలు హనుమజ్జయంతి మాసతిథ్యాదులనిర్ణయము జయంతిదివసమున ఆచరించవలసిన విధులు మారుతియొక్క జన్మవృత్తాంతము హనుమత్ప్రదక్షిణవిధానము ప్రదక్షిణములుచేయుటకు హనుమద్యంత్రము ప్రదక్షిణయోగ్య స్థలము మందవారవ్రత మాహాత్మ్యము మార్గశీర్ష మాసమున కదళీవనమునందు హనుమత్పూజా మాహాత్మ్యము మూర్ఛ విషూచి మొదలైన వ్యాధులను నశింపజేయు హనుమన్మంత్రరాజము హనుమత్కవ

చము మాల మున్నగునవియు విపులముగ వ్రాసియుంటిని. పాఠకులయొక్క సౌకర్యముకొరకు వ్యాకరణాది గ్రాంథికనియమములను పరిపాలింపకయే ఆంధ్రవ్యవహారభాషలో లిఖించియున్నాను. ఇందువలన భక్తులందరకు విషయము కరతలామలకము కాగలదు.

ఆస్తికులగుభక్తులెల్లరు శ్రీహనుమద్దేవుని యథాశక్తిగ పూజించి సమస్తారిష్టములవల్లనుండితొలగి వారి వారి అభీష్టములను పొంది ఐహికాముష్మికసుఖములను శ్రీ హనుమద్దేవునిప్రసాదముచే బడయుదురుగాక!

**శుభం భూయాత్.**

ఇట్లు ఆశాసించు హనుమదుపాసక,
మంత్రశాస్త్రప్రవీణ,
**శిష్టా చంద్రమౌళి శాస్త్రి,**

పెదపాడు, ఏలూరుతాలూకా, పశ్చిమగోదావరిజిల్లా.

# హనుమదుపాసనాప్రాశస్త్యము



శ్లో॥ యత్రాస్తి భోగో నహ తత్ర మోక్షో యత్రాస్తి మోక్షో నహితత్రభోగః । శ్రీమారుతే స్సేవనతత్పరాణాం భోగశ్చ మోక్షశ్చ కరస్థఏవ॥ ఏవం శౌనకసంహితాయామ్.

తా॥ ఎచ్చట భోగముండునో అచ్చట మోక్షములేదు. ఎక్కడ మోక్షముకలదో అచ్చట భోగము లేదు. ఆంజనేయోపాసన జేయువారికి భోగమోక్షములుకరతలామలకములై ఉన్నవనే శాస్త్రప్రమాణమువలన అన్యదేవతారాధనకంటె ఈ హనుమదుపాసన సర్వమతసమ్మత మైనదని వేరు చెప్పనక్కరలేదు.

శ్లో॥ ప్రాప్తం కలియుగం ఘోరం లోభమాయాసమాకులమ్। అధర్మానృతసంయుక్తం దారిద్ర్యవ్యాధిపీడితమ్॥ తస్మిన్కలియుగే ఘోరే కిం సేవ్యం శివమిచ్ఛతా। దస్యుప్రాయాస్సదా భూపా స్సాధవో విపదన్వితాః॥ పీడితాః కలిదారిద్ర్యద్వ్యాధిభి శ్చాపరే జనాః। కిం పఠ్యం కిం ప్రజప్తవ్యం సద్యో విజయకారణమ్॥ సంసారతారకం కింవా భోగస్వర్గాపవర్గదం। తస్మాదుత్తీర్యతే పాపం సద్య ఉపత్సుముదర్తితః॥ కిమత్ర బహునోక్తేన సద్య స్సకలసిద్ధిదమ్। శిష్యం మాం కృపయా వీక్ష్య వద సారం కృపానిధే॥ ఏవం పరాశరసంహితాయామ్.

తా॥తపోనిష్ఠాగరిష్ఠుడైన పరాశరమహామునిని మైత్రేయ మహాముని నమస్కరించి, ఓతపోధనా, ఘోరమైనదియు పాప భూయిష్ఠమైనదియు మోహమాయాసమాకులమైనదియు అధ

ర్మము గలదియు అసత్యముగలదియు నైన కలియుగమునందు జనులు దారిద్ర్యవ్యాధులచే పీడింపబడినవారై, అపత్సముద్రము నందు మగ్నులై యుందురు. అట్టి దుఃఖమగ్నులైన వారిని రక్షించుటకు యేమి పఠింపతగినది ? యేమి జపింపతగిన దని ప్రశ్నించెను.

శ్లో॥ పరాశరః॥ సాధు పృష్టం త్వయావత్స లోకనాముప కారకం। సద్య స్సిద్ధికరం వక్ష్యే శృణుష్వావహితోభవ॥ శైవ వైష్ణవశాక్తార్క-గాణపత్యేందుసంభవాః। న శీఘ్రసిద్ధిదాః ప్రోక్తా శ్చిరకాలఫలప్రదాః॥ తతో౽పి పంచవ క్త్రస్య మారుతే స్తగదీశితుః। విద్యా సిద్ధికరీ శీఘ్రం గుర్వనుగ్రహతో మునే॥

తా॥ ఓమైత్రేయా నీవు అడిగిన ప్రశ్నము లోకోపకారక మైనది. శీఘ్రసిద్ధి నిచ్చు మంత్రరాజమును చెప్పుచుంటిని, వినుమా ! శైవములు శాక్తములు సౌరములు వైష్ణవములు గాణపత్యములు చాంద్రమంత్రములు అను అనేకమహామంత్ర ములు కలవు. అవి అన్నియు చిరకాలము సేవించిన సుఖకరము లగునుగాని శీఘ్రసిద్ధినిచ్చునవి కావు గనుక సర్వమంత్రసార భూతమైనట్టియు శీఘ్రసిద్ధినిచ్చునట్టియు కలియుగమునందు సమస్త వాంఛితార్థసిద్ధినిచ్చునదియు నగు విద్య శ్రీహనుమ ద్విద్యయే కాని మరి వేరు లేదు.

శ్లో॥ అనయా సదృశీ విద్యా నాస్తి నాస్త్యేవ తే శపే ప్రీత్యర్థం న ప్రశంసా తు క్రియతే సత్యమేవ తత్॥

తా॥ ఈహనుమద్విద్యతో సమానమగువిద్య రెండవది లేదు. ఇది శపథముచేసి చెప్పుచుంటిని. ప్రీతికొరకు ప్రశంసిం

చుటలేదు. సత్యముగా ఈహనుమత్సేవ భోగమోక్షములను ఇచ్చునని పరాశరమహాముని హనుమద్భక్తితత్పరుడగు మైత్రేయునకు చెప్పెను.

అన్యత్ర చ ॥ శ్లో ॥ తృణమపి న చల త్యశేషబంధో కపికులనాథ తవాజ్ఞయా వినా వై । ఇతి జగదఖిలం విధేయ భూతం విదితవతాం న కదాపి దుఃఖలేశః ॥ తాళపత్రగ్రంథః.

తా॥ ఓ ఆంజనేయా సమస్తలోకబంధువుడవైన నీ ఆజ్ఞ లేనిదే తృణమైనను చలించదు. సమస్తలోకములు నీకు అధీనమై యున్నవి అని తెలుసుకొనినవారికి దుఃఖలేశమును బాధించదు.

శ్లో॥యస్తు గేహే హనూమంతం భక్త్యానిత్యంప్రపూజయేత్ । తస్యగేహే తత్ప్రభావేన నిత్యం లక్ష్మీ రచంచలా॥ దీర్ఘమాయుర్లభేతైవ సర్వతోవిజయీభవేత్ । మార్యాది భూతసంక్షోభ స్తద్దేశే నైవ జాయతే॥ ఇతి సుదర్శనసంహితాయామ్.

తా॥ లోకమునకు హితముచేయుటకొరకు ఆంజనేయ మంత్రము శంకరునివలన ప్రకాశింపచేయబడినది. ఈహనుమన్మంత్రము యెచ్చట జపించబడునో ఆగృహమందు లక్ష్మి అచంచలమై నివసించియుండును. సర్వత్ర విజయముకలుగును. మంత్రోపాసనచేసినను మాలాకవచము స్తోత్రములు మొదలైనవి పారాయణముచేసినను ఇష్టకార్యసిద్ధులు కలవారై సమస్తరోగములవల్ల విడువబడి అంతమందు శ్రీహనుమత్సాయుజ్యము నొందుదురు. పరాశరసంహితయందు ఈక్రింది రీతిగా చెప్పబడెను.

పరాశర మైత్రేయ సంవాదము :—

శ్లో॥ పూజయిత్వా పురా కోవా సంగతః కీదృశంఫలం।
తన్మమాచక్ష్వ యోగీంద్ర పరాశర కృపాంబుధే॥

తా॥ మైత్రేయులు పరాశరునిగూర్చి, ఓ కృపాసముద్రుడా! పూర్వమందు ఎవరు హనుమంతుని పూజించి ఏమి ఫలము నొందిరో ఆఫలమును చెప్పుమని అడిగెను.

శ్లో॥ మునే విచిత్రం వక్ష్యామి గుహ్యాద్గుహ్యతమం మహత్ । సర్వలోకోపకారాయ సావధానమనాః శ్రుణు॥

తా॥ సర్వలోకములయొక్క ఉపకారముకొరకు విచిత్రమైనటువంటిన్ని అతిరహస్య మైనటువంటిన్ని గొప్పదైన మంత్ర రహస్యమును చెప్పుచుంటిని. సావధానచేతస్కుడవై వినుమా.

శ్లో॥ చైత్రే పుష్యార్కనక్షత్రే మైందో నామ ద్విజోత్తమః । భజమానో హనూమంత మభూత్పూర్ణమనోరథః॥

తా॥ మైందుడనే బ్రాహ్మణోత్తముడు చైత్రమాసమున పుష్యమీనక్షత్రమందు హనుమంతుని పూజించినవాడై సమస్తాభీష్టములను పొందెను.

శ్లో॥ ఆశ్లేషఋక్షే వైశాఖే ధ్వజదత్తో మహాద్విజః । సంపూజ్య శ్రీహనూమంతం మహదైశ్వర్యమాప వై॥ ॥

తా॥ ధ్వజదత్తుడనే బ్రాహ్మణోత్తముడు ఆశ్లేషా నక్షత్రముతోకూడుకొన్న వైశాఖమాసమునందు ఆంజనేయ మూర్తిని పూజించి మహదైశ్వర్యమును పొందెను.

శ్లో॥ వైశాఖమాసి కృష్ణాయాం దశమ్యాం యవనాశ్వకః।పూజయిత్వాహనూమంత మపస్మారాద్విమోచితః

తా॥ యువనాశ్వు డనే బ్రాహ్మణోత్తముడు వైశాఖ బహుళ దశమియందు శ్రీ హనుమంతుని పూజించి అపస్మార రోగమువల్ల విడువబడినవా డాయెను.

శ్లో॥ వైశాఖమాస్యమావాస్యాం చ కపిలో విప్రపుంగవః। సంపూజ్య శ్రీహనూమంత మంతే ముక్తిమవాప సః॥

తా॥ కపిలు డనే బ్రాహ్మణ శ్రేష్ఠుడు వైశాఖమాస అమావాస్యయందు శ్రీ హనుమంతుని పూజించి అంతమందు మోక్షమును పొందెను.

శ్లో॥ జ్యేష్ఠమాసి మఘాబుక్షే హరిశర్మా ద్విజోత్తమః। హనూమంతం భజన్నాస్తే నివృత్తాన్యప్రయోజనః। ॥ తీర్థ యాత్రామటన్ జాతు పరిశ్రాంతః కిలాధ్వనా। తదా కిరాత వేషేణ హనూమాన్ ఖ్యాతభావనః। దదౌ ఫలాని పక్వాని భక్తాయ హరిశర్మణే॥

తా॥ హరిశర్మ యను బ్రాహ్మణోత్తముడు మఘా నక్షత్రముతో కూడుకున్న జ్యేష్ఠమాసమునందు ఆంజనేయ మూర్తిని సేవించుచూ ఇతరపనులులేనివాడై తీర్థయాత్రలు సేవించుచు ఒకరోజున మార్గాయాసముకలవాడై యుండగా ఆసమయమునందు ఆంజనేయమూర్తి బోయవానిరూపముగా వచ్చి పండినఫలములను భక్తుడైన హరిశర్మకొరకు ఇచ్చెను.

శ్లో॥ జ్యేష్ఠశుద్ధద్వితీయాయాం గాలో నామ కిరాతకః। సువర్చలాపతిం ధ్యాయన్ కుష్ఠవ్యాధిం చ తీర్ణవాన్ ॥

తా॥ గాలు డనే కిరాతుడు జ్యేష్ఠశుద్ధ విదియయందు

సువర్చలాపతియగు హనుమంతుని ధ్యానించినవాడై కుష్ఠ వ్యాధినుంచి విముక్తుడాయెను.

శ్లో॥ జ్యేష్ఠశుద్ధదశమ్యాం చ సుముఖోఽప్యంజనాసుతమ్। భజమానో హనూమంతం ప్రత్యక్షం తస్య లబ్ధవాన్॥

తా॥ సుముఖు డనే భక్తుడు జ్యేష్ఠశుద్ధదశమియందు అంజనాపుత్రుడైన శ్రీ ఆంజనేయమూర్తిని సేవించుచుండగా ఆ ఆంజనేయమూర్తియొక్క ప్రత్యక్షదర్శనమును పొందినవాడాయెను.

శ్లో॥ ఆషాఢమాసి రోహిణ్యా మింద్ర స్సంపూజ్య మారుతిమ్। జితవాన్ వృత్రనామాన మసురం లోకకంటకమ్॥

తా॥ దేవేంద్రుడు ఆషాఢమాసమున రోహిణీనక్షత్రమునందు మారుతిని భక్తితో పూజించి లోకకంటకుడగు వృత్రాసురుని జయించెను.

శ్లో॥ శ్రావణ్యాం పౌర్ణమాస్యాం చ కశ్యపః కేసరీసుతమ్। సంపూజ్య సకలాభీష్టా నవాప మునిపుంగవ॥

తా॥ కశ్యపు డనే మహర్షి శ్రావణశుద్ధపూర్ణిమయందు కేసరీపుత్రుని పూజించి, ఓ మైత్రేయమహర్షీ, సమస్తమైన కోరికలను పొందెను.

శ్లో॥ మాసి భాద్రపదేఽశ్విన్యాం నాగకన్యా సుమధ్యమా। హనూమత్పూజనా శీఘ్రం నాగలోకేశతామగాత్॥

తా॥ నాగకన్యక యను మహాపతివ్రత భాద్రపదమాసమున అశ్వినీనక్షత్రమున హనుమంతుని పూజించి శీఘ్రముగా నాగలోకఆధిపత్యమును పొందెను,

శ్లో॥ మృగశీర్షాఖ్యతారాయాం మాఘమాసే మాసు తిథౌ । సంపూజ్య ద్రౌపదీ భక్త్యా ప్రసిద్ధిమతులామగాత్ ॥

తా॥ ద్రౌపదీదేవి మృగశీర్షానక్షత్రముతో కూడు కున్న ఆశ్వయుజమాసమందు భక్తిచేతను మారుతిని పూజించి గొప్పప్రసిద్ధిని పొందెను.

శ్లో॥ ద్వాదశ్యాం కార్తికే మాసే శుక్లపక్షేతు కుంభజః । హనూమద్భజనాదేవ చులుకేఽబ్ధిం చకార హై ॥

తా॥ అగస్త్యమహర్షి కార్తీకశుద్ధ ద్వాదశియందు హనూమత్సేవవల్ల సముద్రమును పానముచేసెను.

శ్లో॥ మార్గశీర్షే త్రయోదశ్యాం సోమదత్తః కపీశ్వరమ్। హనూమద్భజనేనైవ రాజ్యం పున రవాప్తవాన్॥

తా॥ సోమదత్తుడనే మహారాజు మార్గశిరశుద్ధత్రయోదశియందు కపీశ్వరుని పూజించుటచేతనే తిరిగి రాజ్యమును పొందినవాడాయెను.

శ్లో॥ ఉత్తరాయాం సుషేణాఖ్యో గంధర్వః పుష్య నామకే । ఆంజనేయం సమభ్యర్చ్య గానవిద్యాతిగై పుణః॥

తా॥ సుషేణుడనే గంధర్వుడు పుష్యమాసమునందు ఉత్తరానక్షత్రమున ఆంజనేయుని పూజించి గానవిద్యయందు మిక్కిలి శ్రేష్ఠుడాయెను.

శ్లో॥ మాఘే చార్ద్రాఖ్యనక్షత్రే హనుమంతం భజం స్తతః । విభీషణసుతో నీల స్సర్వాభీష్టానవాప సః॥

తా॥ విభీషణునికుమారుడైన నీలుడు మాఘమాస

మున ఆర్ద్రానక్షత్రమునందు హనుమంతుని పూజించినవాడై సమస్తకోరికలను పొందెను.

శ్లో॥ పునర్వస్వాఖ్యనక్షత్రే ఫాల్గునే మాసి చాంగదః ।
హనుమంతం భజన్ శీఘ్రం యువరాజత్వమాప్తవాన్॥

తా॥ అంగదుడు ఫాల్గునమాసమున పునర్వసునక్షత్రమున హనుమంతుని పూజించి యువరాజత్వమును పొందెను.

శ్లో॥ ఆదిత్యహస్తనక్షత్రే శౌర్యశాలీ ధనంజయః ।
హనూమంతం భజన్ కృష్ణం సారథిం కృతవాన్హరిమ్॥

తా॥ అర్జునుడు హస్తానక్షత్రముతో కూడిన ఆదివారమున హనుమంతుని సేవించి హరిరూపుడైన కృష్ణుని సారథిగా పొందినవాడాయెను.

శ్లో॥ మృగశీర్షాఖ్యనక్షత్రే భానువారే వృకోదరః ।
హనూమంతం భజన్ సద్యో జితవానఖిలానరీన్॥

తా॥ భీముడు మృగశీర్షానక్షత్రముతో కూడిన భానువారమున హనుమంతుని పూజించి అప్పుడే సర్వశత్రువులను జయించెను.

శ్లో॥ పూర్వాభాద్రాఖ్య నక్షత్రే పుష్కరో వానరేశ్వరమ్। భజన్ లోకే మహాఖ్యాతిం తపస్సిద్ధిమవాప్తవాన్॥

తా॥ పుష్కరుడనే మహాభక్తుడు పూర్వాభాద్రానక్షత్రమునందు వానరేశ్వరుని పూజించి లోకమందు గొప్పకీర్తిగల తపస్సిద్ధిని పొందెను.

శ్లో॥ సతతం మందవారేషు భరతః క్షత్రియోత్తమః ।
హనుమంతం భజన్నస్థా నిరంకుశపరాక్రమః॥

తా॥ క్షత్రియోత్తముడైన భరతుడు ప్రతిశనివారము నందును హనుమంతుని సేవించి నిరంకుశమైన పరాక్రమము కలవాడాయెను.

శ్లో॥ ప్రతివైధృతియోగేషు సంపూజ్య పవనాత్మజన్।
లేభే దృఢాం తపస్సిద్ధిం దుర్వాసా మునిపుంగవః ॥

తా॥ మునిపుంగవుడైన దూర్వాసమహర్షి ప్రతివైధృతి నామయోగమునందును హనుమంతుని పూజించి దృఢమైన తపస్సిద్ధిని పొందెను.

శ్లో॥ అమాయుక్తేందువారే చ హనుమద్భజనాత్కిల।
తారయా సంగతశ్శ్రీమాన్ సుగ్రీవో విగతవ్యథః॥

తా॥ సుగ్రీవుడు సోమవారముతో కూడుకున్న అమావాస్యయందు హనుమత్సేవ వలన పోయినటువంటి దుఃఖము కలవాడై తారతో కూడుకున్న వాడాయెను.

శ్లో॥ భౌమవారే హనూమంతం సీతా సంపూజ్య యత్నతః। గతవ్యథా మనోవాంఛాసిద్ధిం శీఘ్ర మవాప సా॥

తా॥ సీతాదేవి ప్రతి మంగళవారమునందును హనూమంతుని భక్తిశ్రద్ధలచే పూజించి పోయిన దుఃఖముకలదై శీఘ్రముగా ఇష్టసిద్ధిని పొందెను.

శ్లో॥ తస్మాదుక్తేషు కాలేషు మైత్రేయ మునిసత్తమ।
భజస్వ వాయుపుత్రం త్వం సర్వాభీష్టమవాప్స్యసి॥

తా॥ ఓ మైత్రేయమహర్షీ, ఈ చెప్పబడిన కాలములయందు వాయుపుత్రుని సేవించుమూ, నీవు సమస్తమైన కోరికలను పొందగలవు అని పరాశరమహర్షి మైత్రేయునకు చెప్పెను.

ఇట్టి దృష్టాంతములు శౌనకసంహితయందును సుదర్శనసంహిత యందును తాళపత్ర గ్రంథములయందును అనేకములు గలవు గాని ఇంకను వ్రాయుటకు గ్రంథవిస్తరభీతిచే ముగించ బడినది.

మ రి ఒ క వి ష య ము :

ఈ హనుమన్మూర్తినిగురించిన సందేహము లనేకములు కలవు కాని అందు ముఖ్యఅనుమాన మేమన : ఆంజనేయునకు వివాహము కాలేదనియు కేవలబ్రహ్మచారియనియు పెద్దప్రతీతి గలదు. బ్రహ్మచారియను శబ్దమునకు అనేక అర్థములు కలవు గాన ఈ సందేహమును పోగొట్టి వివాహితుడని నిర్ణయించు టకు తగిన దృష్టాంతములను పరాశరసంహితాది గ్రంథముల యందు గల శ్లోకములను వ్రాయుచున్నాను.

విశ్వకర్మకు ఛాయాదేవియను కుమార్తెకలదు. ఆకుమా ర్తెను సూర్యునకిచ్చి వివాహముచేసినంత తనభర్తయగు సూ ర్యునివద్ద నివసించుటకు ఆతీవ్రమైన వేడిమికినిలువజాలక ఛాయా దేవి తనతల్లినిన్నీ తండ్రియగువిశ్వకర్మనున్నూ తనభర్తయగు సూర్యదేవుని వేడిమి తగ్గించుమని వేడినంత విశ్వకర్మ కుమార్తె యందుగల ప్రేమచే సూర్యునివేడిమితగ్గించనిశ్చయించి సూర్య బింబమును సానపట్టెన, ఆ సానపట్టెనరజనునుండి అతిసౌందర్య వతియగు చిన్నది బయలుదేరెను. ఆ సౌందర్యాతిశయమును జూచి సువర్చల యను నామకరణము ఆ బాలికకు చేసిరి. ఆ చిన్నది దినదినప్రవర్ధమాన యగుచు సూర్యునిసమీపమున పెరుగుచుండెను. అంత ఆంజనేయమూర్తి సూర్యునివద్ద విద్యా

భ్యాసమునకు వెళ్లి వేద వేదాంగములను అతి కొలదికాలములో చదివినంత సూర్యునకు సంతోషముకలిగి తన కుమార్తెయగు సువర్చలనిచ్చి వివాహముచేయుదు ననుతలంపు హనుమంతు నకు తెలిపెను. ఆంజనేయమూర్తియు గురుభక్తిగలవాడగు టచే అంగీకరించి వివాహమాడెను.

పరాశరసంహితయందు :—

శ్లో॥ తస్యవిద్యాం చ బుద్ధిం చ బలశౌర్యపరాక్రమాన్। విచార్య తస్మై ప్రదదౌ తస్య కన్యాం సువర్చలామ్॥ తా ముద్వాహ్య మహాతేజా హనుమాన్మరుతాత్మజః। భూయఃకిల కిలాంకుర్వ న్ననర్తాయమ్మహాకపిః॥

తా॥ శౌనకసంహిత మొదలైన గ్రంథములయందు కూడా ఈ క్రిందిరీతిగా పూజా విధానమునందు ఆహ్వానము చేయునప్పుడు చెప్పబడియున్నది.

శ్లో॥ ఆగచ్ఛ హనుమద్దేవ త్వం సువర్చలయా సహ। పూజాసమాప్తిపర్యంతం భవ సన్నిహితో ముదా॥

తా॥ ఓ ఆంజనేయమూర్తీ నీవు సువర్చలతో కూడు కున్నవాడవై పూజాంతమువరకు నాసమీపమున నుండుము.

మరియొకభక్తుడు ఈ విధముగా హనుమన్మూర్తిని గూర్చి ప్రార్థనచేసినట్లు తాళపత్రగ్రంథమందుగలదు :—

శ్లో॥ జాయా చాపి సువర్చలా రవిసుతా దివ్యం చ హేమాంబరం। మాణిక్యాంచితకుండలే శ్రవణయోః కంఠేచ ముక్తావళిః॥ సుగ్రీవాంగదగంధమాదనముఖా స్సత్పార్షదా

స్సంతితే । కిందాస్యామి మనః ప్రియాణి హనుమాన్ సంపూర్ణ కామో భవాన్॥

నానాగీతలయందు ఇదేవిధముగా కలదు :—

శ్లో॥ మాతా సువర్చలాదేవీ పితా మే వాయునందనః। బాంధవా హమమద్భక్తాః స్వదేశం భువనత్రయమ్॥ భక్త కల్పతరుం సౌమ్యం లోకోత్తర గుణాకరమ్ । సువర్చలాపతిం వందే మారుతిం వరదం సదా॥

మహాభక్తురాలగు నాగకన్యక యెదుట ఈ విధముగా ప్రత్యక్షమాయెను. పరాశరసంహిత :—

శ్లో॥ తస్మిన్కాలే మహాబాహో వరదో భీమవిక్రమః। పరివారయుతో ధీరః సామాత్యో భక్తవత్సలః। సర్వాలంకార సంయుక్త ముష్ట్రి మారుహ్య వేగవాన్ । త్రిమూర్త్యాత్మా మహావీరో హనూమా న్ససువర్చలః॥ భక్తసంరక్షణాధియా భగవాన్వాయునందనః । పురతో నాగకన్యాయాః ప్రోవాచ కపికుంజరః॥

తా॥ సర్వాలంకారములతో కూడుకున్న ఒంటెను సువర్చలా సహితముగా అధిష్ఠించి భక్తరక్షణుడగు హనుమంతుడు నాగకన్యక యొక్క ముందర ప్రత్యక్షమై పలికెను.

సువర్చలాద్వాదశాక్షరి యను మంత్రమునందు ఈ ధ్యానము కలదు :—

శ్లో॥ ఏకేనాభయదం పరేణ వరదం భోజ్యం పరం చాపకే । హాన్యేనాపి సువర్చలాకుచయుగం హస్తేన సంబిభ్రతమ్। కారుణ్యామృత పూర్ణలోచనయుగం పీతాంబరాలం

కృతం । సౌమ్యం వాయుసుతం చతుర్భుజయుతం ధ్యాయే హనూమత్ప్రభున్॥ పరాశరసంహితా :—

శ్లో॥ కస్మిన్దేశే నివసతి కిమాచరతి సర్వదా । కీదృశాః పార్షదా స్తస్య కింకుర్వంతి మహాత్మనః॥ కి మాహారో విహారో వా కాలక్షేపం చ కిం హరేః । శ్రోతు మిచ్ఛా మ్యహం బ్రహ్మన్ వక్తుమర్హసి సువ్రత ॥

తా॥ ఓ పరాశరమునీంద్రా, ఆంజనేయమూర్తికి ఏదేశమందు నివాసము? ఏమిచేయుచుండును? పార్షదులు ఎటువంటివారు ? ఆ మహానుభావునకు ఏమిచేయుచుందురు? ఏమి ఆహారము భుజించును? విహారమెచ్చట ? ఏమి కాలక్షేపముచేయుచుండును? ఇదంతయు వినుటయందు కోరిక కలవాడను. చెప్పుటకు తమరు సమర్థులు అని మైత్రేయులు పరాశరుని అడిగెను.

పరాశరః:-శ్లో॥ సాధు పృష్టం త్వయావిద్వన్ హనూమచ్చరితం శుభమ్। శృణుష్వైకమనా భూయో వక్ష్యామి ముని పుంగవ ॥

తా॥ ఓ మైత్రేయా నీచేతను శుభమైన హనుమచ్చరిత్రము అడుగబడినది. ఏకాగ్రతకలవాడవై వినుమా, తిరిగి చెప్పెదను.

శ్లో॥ సుమేరో ర్నైఋతే భాగే పర్వతో గంధమాదనః। సర్వపాదపసంకీర్ణో విచిత్రో ధాతుమండితః॥నానాశకుంతవిరుతై ర్నానాకుసుమరాశిభిః। సువర్ణకదలీషండై ర్నీరంధ్రఫలరాశిభిః॥ మునీనాం పర్ణశాలాశ్చ బహవ స్తత్ర శోభనాః। గంధర్వమిథునానాంచ క్రీడాగుంజా స్సహస్రశః॥ ఏలా లవంగతక్కోలచంద

నాగరుశాఖినః। కర్పూరరంభా జంబీరమాతులుంగలవంగకాః॥ నారికేళామ్రపనస జంబూఖర్జూరదాడిమాః। ద్రాక్షాబదరీ నారంగ చామంతీ చంపకాదయః॥ పున్నాగాశోకమాలత్యో వాసంతీ నవమాలికాః। తాళా స్తమాలా హింతాళా వకుళాః కేతకాదయః॥ తత్రత్య సర్వజంతూనాం జాతివైరం న విద్యతే। తరవస్సర్వకాలేషు ఫలితా స్తత్ర పుష్పితాః॥ పుష్పాంబుకుల్యా స్సర్వత్ర కస్తూరీమృగిణ స్తథా। బహుకుంకుమ కేదారా స్సంతి కర్పూరరాశయః॥ ఏవం విచిత్రశైలేంద్రే కపీంద్రో గంధమా దనే। మనోహరై ర్మహాకుంజై ర్మకరందసరోవరైః। సర్వ స్సు సంపన్నే సర్వప్రాణిసుఖావహే॥గిరినిర్ఝరసాహస్రైః శ్రితై కమలాకరైః। సింహవ్యాఘ్రవరాహైశ్చ శరభై ర్గవయై శ్శశైః। కృష్ణసారై ర్మృగై రన్యైః శ్వాపదైశ్చ సమాకులే॥ తత్ర దివ్యగుహారమ్యావిశాలా యుక్తమానుతా। దశయోజనవి స్తీర్ణ సువర్ణ మణిరంజితా। తస్యాంహనూమతీప్రీత్యర్థం నిర్మితా విశ్వ కర్మణా। మహేంద్రస్యాజ్ఞయా రత్నశాలా స్సౌవర్ణ శాలికాః।కాశ్చి ద్గానుడశాలాశ్చ కాశ్చిన్మౌక్తికశాలికాః ఇంద్ర నీలామయాశ్శాలాః ప్రవాళఖచితాంతరాః॥ పద్మరాగమ యాః కాశ్చిత్ కురువిందైశ్చ భూషితాః। వైదూర్యమణికుడ్యాశ్చ శుద్ధస్ఫటికవేదికాః। శాతకుంభమయ స్తంభాః దాంతరాజిత తోరణాః। పుష్యరాగమ యద్వారా మణికుట్టిమ భూమయః॥ ముక్తావితానసాహస్రై ర్గ్రథితాశ్చ సమంతతః। మహాస్తా స్త రణోపేతా నైజయంత్యధిక ప్రభాః॥సుధర్మాతుల్యసౌభాగ్యాః విచిత్రాః పుష్పకోపమాః। సువర్చలాయుతో నిత్యం తాసు క్రీడతి మారుతిః॥

తా॥ మేరుపర్వతముయొక్క నైరృతి భాగమునందు గంధమాదన పర్వతము కలదు. ఆపర్వతరాజము సమస్తమైన వృక్షములతోటిన్నీ చిత్రవిచిత్రములైన గైరికాది ధాతువుల తోటిన్నీ బంగారు అరటిచెట్లతోటిన్నీ అనేకమైన పక్షుల తోటిన్నీ అనేక పుష్పరాసులతోటిన్నీ మునులయొక్క పర్ణ శాలలతోటిన్నీ గంధర్వక్రీడాగృహములతోటిన్నీ ఏలాలవం గాది తీగలతోటిన్నీ నారికేళ మామిడి నిమ్మ అరటి పనస నేరేడు ఖర్జూర దానిమ్మ ద్రాక్ష మొదలుగాగల ఫలవృక్ష ములతోటిన్నీ సర్వజంతు జాతివైరము లేనటువంటిన్నీ సర్వ ఋతువులయందు ఫలించు వృక్షపుష్పసముదాయములతోటిన్నీ సింహశరభమృగాదులతోటి వ్యాప్తమైనటువంటి ఆ పర్వతము నందు పది ఆమడల విస్తీర్ణముగలదియు సువర్ణ మణులచేత రచించబడినదియు హనుమత్ప్రీతికొరకు విశ్వకర్మ చేతనునిర్మించ బడిన గాయత్ర్యాదిశాలలయందు సువర్చలాసమేతుడై ఆంజనేయ మూర్తి క్రీడించుచునుండెను. అని పరాశరసంహితలో కలదు. ఇట్టి దృష్టాంతములు అనేకములు గలవు.

ఆంజనేయుని వివాహమాసతిథ్యాదులున్నూ పరాశర సంహితయందుగల శ్లోకములు వ్రాయుచుంటిని :—

శ్లో॥ జ్యేష్ఠశుద్ధదశమ్యాంచ భగవాన్భాస్కరో నిజాం। సుతాం సువర్చలాం నామ ప్రాదా త్ప్రీత్యా హనూమతే ॥ అత స్తస్యాం తిథౌ భక్తో వివాహోత్సవ మాచరేత్ । మూర్తిం సువర్చలాయాశ్చ తథైవ చ హనూమతః॥ కారయిత్వా సువ ర్ణాద్యైః స్వగృహోక్త విధానతః।నృత్తగీతైశ్చ వాద్యైశ్చకార

యేచ్ఛ యథావిధి। నృత్యంతు ద్వివిధం ప్రోక్తమేకం ద్రష్టుర్మనోహరమ్॥ అంగభంగాత్మకం చాన్య త్సర్వపాపప్రణాశనమ్। వివాహే వాయుపుత్రస్య బ్రాహ్మణా నపి భోజయేత్ ॥ పూర్ణిమాయాం నాకబలిం వివాహానభృథం చరేత్ । ఏవం యఃకురుతే తస్య గేహే లక్ష్మీః స్వయం వసేత్॥భుక్త్వాభోగా న్యథాకామం హనుమల్లోక మాప్నుయాత్॥

తా॥ జ్యేష్ఠశుద్ధదశమియందు సూర్యుడు తనకుమార్తెయగు సువర్చలాదేవిని హనుమంతున కిచ్చి వివాహము చేసెను. ఆతిథియందు భక్తులు సువర్చలయొక్క మూర్తిన్ని ఆంజనేయమూర్తిన్ని సువర్ణము మొదలైనవాట్లచేతను యథాశక్తిగా విగ్రహములను చేయించి స్వగృహ్యోక్త విధానముగ నృత్యగీతాదులతోటి కల్యాణమును చేసి అనంతరమునందు బ్రాహ్మణసమారాధనముచేసి పిమ్మట అవభృథమును గావించిన వారల ఇంటియందు లక్ష్మీదేవి అచంచలయై నివసించును. ఈలోకమునందు ఇష్టసిద్ధులనుపొంది అంతమందు హనుమత్సాయుజ్యమును పొందుదురు గాన భక్తులెల్లరు కల్యాణమును ఇచ్చట వివరించిన మాసతిథ్యాదులయందు చేసి తరింతురుగాక. ప్రవరనున్ను వ్రాయుచుంటిని:—

| ఆంజనేయప్రవర : | సువర్చలప్రవర : |
|---|---|
| ముత్తాత అంగిరసుడు | బ్రహ్మ ముత్తాత |
| తాత మరీచుడు | కశ్యపుడు తాత |
| తండ్రి వాయుదేవుడు | సూర్యుడు తండ్రి |
| వరుడు ఆంజనేయులు | కన్య సువర్చల |
| కౌండిన్యసగోత్రం | కాశ్యపసగోత్రం |

ఆంజనేయనవావతారనిరూపణము

శ్లో॥ ఆద్యః ప్రసన్నహనుమాన్ ద్వితీయో వీరమారుతిః। తృతీయో వింశతిభుజః చతుర్థః పంచవక్త్రకః॥ పంచమో ఒష్టాదశభుజః శరణ్య స్సర్వదేహినామ్। సువర్చలాపతి ష్షష్ఠః సప్తమస్తు చతుర్భుజః॥ అష్టమః కథితః శ్రీమాన్ ద్వాత్రింశద్భుజమండలః। నవమో వానరాకార ఇత్యేవం నవరూపధృత్॥

శ్లో॥ యస్య శ్రవణమాత్రేణ జంతుర్జన్మఫలం లభేత్। పురా బ్రహ్మా మహోత్సాహః చతుర్ముఖ ఇతి స్మృతః॥ మారుతిం వింశతిభుజ ముపాస్యాసీ త్ప్రజాపతిః కపిలస్తు మహాతేజా బ్రాహ్మణో వేదపారగః॥ చతుర్భుజహనూమంతం ఉపాస్యాసీ ద్విమోచితః। విజయస్తుమహాశూరః క్షత్రియో లోకపాలకః॥ ప్రసన్నహనుమద్ధ్యానా త్సంసారాబ్ధి మతీతరత్। విభీషణసుతో నీలః సతతం సాధుపూజితః॥ పంచవక్త్రహనూమంతం ఉపాస్యాసీ త్సమృద్ధిభాక్। ఉపాస్య వానరాకారం గాలో నామ వనేచరః॥ ప్రాప్తవాన్ పరమాం శుద్ధి మారోగ్యం శ్రీహనూమతః। ధ్వజదత్త స్సువిప్రేంద్రః సర్వశాస్త్రవిశారదః। సువర్చలాహనూమంత ముపాస్య ధనికోఽభవత్॥ మైంద స్సర్వవిదాం శ్రేష్ఠః ధ్యాత్వా వై వీరమారుతిమ్। త్రీంల్లోకాంశ్చ సరిన్మధ్యే బహుచిత్ర స్సువిస్మయమ్॥ సోమదత్తో మహారాజ ద్వాత్రింశద్భుజమారుతిమ్ రాజ్యభ్రష్టో గతాశంకో సోఽభూద్రాజ్యమవాపహ। ఉపాస్యాష్టాదశభుజం హనూమంతం మహాప్రభుమ్॥ లేభే పరమయోగిత్వం దుర్వాసా లోకవిశ్రుతః। ఏవం బ్రహ్మర్షయోఽప్యన్యే తథా రాజర్షయః పరే॥ ఉపాస్య నవ

రూపాణి లేభిరే న్యాన్మనోరథాన్। ద్వయీ హనుమతో వృత్తిః సమంతాద్భక్తరక్షణమ్। శిష్టానాం పాలనం త్వాద్యం ద్వితీయం దుష్టమర్దనమ్। ఇతిపరాశరసంహితాయామ్॥

తా॥ హనుమదవతారములు అనేకములు కలవు. కాని వానిలో ముఖ్యమైన అవతారములు తొమ్మిది కలవు. మొదటిది ప్రసన్న హనుమదవతారము. విజయు డను క్షత్రియోత్తముడు ప్రసన్న హనునుదుపాసనవలన సంసారసాగరమును తరించెను. రెండవది వీరాంజనేయావతారము. మైందు డను మహానుభావుడు వీరాంజనేయోపాసనవలన మూడులోకములను సాగరమధ్యమున తేల్చెను. మూడవది వింశతిభుజాంజనేయావతారము. బ్రహ్మదేవుడు వింశతిభుజాంజనేయోపాసనవలన ప్రజాపతి యయ్యెను. నాల్గవది పంచముఖాంజనేయావతారము. విభీషణపుత్రుడగు నీలుడు పంచముఖాంజనేయోపాసనవలన ఇష్టసిద్ధికలవాడాయెను. అయిదవది అష్టాదశభుజాంజనేయావతారము. దూర్వాసుడు అష్టాదశభుజాంజనేయోపాసనవలన పరమయోగియయ్యెను. ఆరవది సువర్చలాహనుమదవతారము. ధ్వజదత్తుడనుదరిద్రబ్రాహ్మణుడు సువర్చలాహనుమదుపాసనవలన ధనవంతుడాయెను. ఏడవది చతుర్భుజాంజనేయావతారము. కపిలుడను బ్రాహ్మణుడు చతుర్భుజ హనుమదుపాసనవలన ముక్తిని పొందెను. ఎనిమిదవది ద్వాత్రింశద్భుజాంజనేయావతారము. సోమదత్తుడను మహారాజు రాజ్యభ్రష్టుడై ద్వాత్రింశద్భుజాంజనేయోపాసనవలన మరల రాజ్యమును పొందెను. తొమ్మిదవది వానరాకారాంజనేయావతారము. గాలు డను కిరాతుడు వానరాకారాంజనేయోపాసన

వలన కుష్ఠవ్యాధినుండి విముక్తుడాయెను. ఇట్లు అనేకులు బ్రహ్మర్షులును అనేకులు రాజర్షులును తదితరులును హనుమ దుపాసనవలన తమతమమనోరథములను పొంది కృతార్థులయిరి. శిష్టులనురక్షించుటయు దుష్టులను శిక్షించుటయు అను రెండు కార్యములకొరకు హనుమదవతారములు యేర్పడినవని పరాశరసంహితయందు మైత్రేయునికి పరాశరుడు తెలిపెను.

**శుభం శుభం శుభమ్.**

---

## స ప్త మ ప ట ల ప్రా ర ం భ ః.

మైత్రేయః॥ ఆంజనేయస్వరూపం తస్యోత్పత్తి ర్మంత్రవైభవః। కథితాని త్వయా బ్రహ్మన్ శ్రుతానీహ మయా ప్రభో॥ ౧॥ సువర్చలా సమేత శ్రీ హనుమద్ద్వాదశాక్షరః। కీదృశః తత్పురశ్చర్యా తస్యోత్పత్తిశ్చ కీదృశీ॥ ౨॥ పురా కేవా పురశ్చర్యాం కృత్వా సిద్ధి మవాప్నువన్। శ్రోతు మిచ్ఛామి తత్సర్వం వక్తవ్యం భగవన్మునే॥ ౩॥ పరాశరః- శ్లో॥ సప్తకోటి మహామంత్రాః ప్రోక్తా గౌర్యైహి శంభునా। శైవాశ్చ వైష్ణవా సౌరాః గాణపత్యాశ్శివాత్మికాః ॥ ౪॥ కౌమారా భైరవా శ్చాన్యే కేచి న్మంత్రా హనూమతః। కేచి ద్భుక్తిం ప్రయ చ్ఛంతి కేచిన్ముక్తిం దిశంతి చ ॥౫॥ దేవతానాం యథా విష్ణు ర్నక్షత్రాణాం యథాశశీ గ్రహాణాంతు సహస్రాంశు ర్నదీనాం జాహ్నవీ యథా ॥౬॥ తథా సువర్చలాయుక్తహనుమ ద్ద్వాదశాక్షరః। మంత్రః శ్రేష్ఠతర శ్శీఘ్రం భుక్తిం ముక్తిం ప్రయచ్ఛతి ॥౭॥ న కాలదేశనియమో నారిమిత్రాదిశోధనమ్।

ప్రసన్నోపాసక గురో ర్ముఖా ల్లబ్ధ్వా మనుంత్విమమ్॥౮॥ గురుం
సంతోషయే ద్ధీమాన్ శుశ్రూషాస్వర్ణ భూషణైః వస్త్రై
శ్చాన్యై ర్ధూపదీపై రభీష్టైః మృష్టభోజనైః ॥౯॥ గురో
స్సంతోషణేనైవ హనుమాన్ భక్తవత్సలః। సంతుష్య సకలా
నిష్టాన్ దదాతీహ న సంశయః॥ ౧౦॥ అత్యాశ మతిలుబ్ధం చ
దాంభికం జ్ఞానవర్జితమ్।అసంతుష్ట మశాంతంచ న పాపం గురు
మాశ్రయేత్॥ ౧౧॥ నాస్తికాయ కృతఘ్నాయ పంచకాయాతి
లోభినే। అనాచారాయ పాపాయ నైతన్మంత్రం ప్రదాప
యేత్॥౧౨॥ జగత్ప్రాణ తనూజత్వా జ్జగతః ప్రాణ ఏవ సః।
తదధీనం జగత్సర్వ మితి మే నిశ్చితా మతిః॥ ౧౩॥ ఆదౌ
ప్రణవముచ్చార్య శ్రీబీజంతదనంతరమ్। తతఃశ్రీవర్ణ ముచ్చార్య
సువర్చలా పదం తథా॥౧౪॥ హనుమత్పద ముచ్చార్య నమ
శ్శబ్దం తతః పరమ్। ద్వాదశాక్షరమంత్రోఽయం పురశ్చర్యా
విధిం శృణు॥ ౧౫॥ అహమేవ ఋషి స్తత్ర గాయత్రీ చ్ఛంద
ఏవ వా। సువర్చలాసమేత శ్రీహనుమాన్ దేవతా తథా॥౧౬॥
మారుతాత్మజబీజంచ అంజనాసుతశక్తి చ। కీలకం వాయు
పుత్రస్తు మమ శ్రీపదముచ్చరేత్ ॥ ౧౭॥ సువర్చలేశహనుమ
త్ప్రసాదే వినియోజనమ్। అంగన్యాసం కరన్యాసం కుర్యా
ద్వై మూలమంత్రతః ॥౧౮॥అంజనాసుతాయేతి తథాతతో వై
రుద్రమూర్తయే। వాయుసుతాయేతి తథా అగ్నిగర్భాయతతః
పరమ్॥౧౯॥ శ్రీరామముఖ్యదూతశ్చ బ్రహ్మాస్త్రాదినివారణః।
భూర్భువస్సువరో మితి దిగ్బంధన పదం వదేత్ ॥౨౦॥
ధ్యానమ్.సువర్చలాధిష్ఠితవామభాగంవీరాసనస్థం కపిబృందసేవి

తన్॥ స్వపాద మూలం శరణం గత్వా నా మభీష్టదం శ్రీహను మంతమిాశే॥ ౨౧॥ గ్రంథాంతరే-శ్లో॥ భక్తకల్పతరుం సౌమ్యం లోకోత్తరగుణాకరన్ సువర్చలాపతిం వందే మారుతిం వరదం సదా॥ ౨౨॥ పద్మాసనం సమాస్థాయ పూర్వాభిముఖతో నరః। ప్రాతఃకాల ఉపక్రమ్య అపరాహ్ణే జపే న్మనుమ్॥ ౨౩॥ ఆంజ నేయః పూజిత శ్చే త్పూజితా స్సర్వదేవతాః। హనుమ న్మహిమా౽శక్యో బ్రహ్మణాపి న వర్ణితుమ్॥ ౨౪॥ సింధుసంగమ మధ్యేతు నదీతీరే విశేషతః హనుమత్సన్నిధౌ వాపి గృహ మధ్యే విశేషతః॥ ౨౫॥ అశ్వత్థ తరుమూలేతు పర్వతాగ్రే తథైవచ। అయుతం తు పురశ్చర్యా మితాహారో జితేంద్రియః ౨౬॥ జపమధ్యే వ్యథశ్చాయీ హవిష్యం భక్షయే త్తతః। ప్రథమేహ్ని యథాహార ఆసమాప్తి తథైవహి॥ ౨౭॥ దశాంశం తర్పయే ద్ధీమాన్ తద్దశాంశం హువే త్తథా। పాయసాపూప దధ్యన్నై ర్బ్రాహ్మణా న్భోజయే త్తతః॥ ౨౮॥ గోక్షీరశర్కరా జ్యైశ్చ తర్పణంతు సమాచరేత్। మధ్వాజ్యశర్కరాభిశ్చ అపూపైశ్చ హువే త్తతః॥ ౨౯॥ ఖర్జూర కదళీభిశ్చ నారికేళ ఫలై స్తథా। మల్లికాజాతి పుష్పైశ్చ చంపకైః కేతకై స్తథా॥ ౩౦॥ హువే దష్టోత్తరశతం కుబేర సదృశో భవేత్। సురరాజ సమం లోకే ఐశ్వర్యం శాశ్వతం ధ్రువన్॥౩౧॥ హనూమ త్కృపయా నిత్యం సర్వలోకో వశో భవేత్। ఏత స్యైవ జపే నేంద్రో వృత్రాసుర మనాశయత్॥ ౩౨॥ ఇమం జప్త్వా భీమ సేనో జరాసంధ మసూదయత్। స్వాస్త్రావికార సిద్ధ్యర్థ మేత ద్బ్రహ్మో జజాపహ॥ ౩౩॥ ఏవం విభీషణం లబ్ధ్వా త్రాణ్లో

ప్యమృతమాహరత్ । గర్గాచార్యాదిమం లబ్ధ్వా సీతా సా జన
కాత్మజా॥ ౩౮॥జఘాన లీలయా పూర్వంశతాననమహాసురమ్ ।
ఏతన్మంత్రపురశ్చర్యా కృతా పూర్వం మహాత్మభిః॥ ౩౯॥
మైత్రేయః॥ శతాననవధం సీతా కథం కృతవతీ పురా। రామే
చ లక్ష్మణేచైవ శత్రుఘ్నే భరతే స్థితే। హనూమత్యపి సుగ్రీవే
తత్సర్వం వర్ణ్యతాం మునే। శ్రోతుమిచ్ఛామ్యహం బ్రహ్మన్
పరం కౌతూహలంహి మే॥ ౪౦॥ పరాశరః సప్తమపటలమ్.

## యంత్రోద్ధారః.

అథ పూజావిధానార్థం యంత్రలక్షణ ముచ్యతే। సర్వ
యంత్ర శ్రేష్ఠతమం భుక్తిముక్తిఫలప్రదమ్॥ ౪౧॥ ప్రథమం
వర్తులం లేఖ్య మష్టకోణం చ విన్యసేత్॥ తద్బహిః ర్వృత్త
మాలిఖ్య షోడశాబ్జం చ లేఖయేత్॥ ౪౨॥ తద్బహిర్వృత్త
మాలిఖ్య లేఖయే ద్భూపురద్వయం। తతః పరం చతుర్ద్వారం
సుందరం తద్విలేఖయేత్॥ ౪౩॥ పరమోత్కృష్ట మోంకారం
యంత్రమధ్యే విలేఖయేత్। అష్టాక్షరీమహామంత్ర మష్ట
కోణేషు లేఖయేత్॥ ౪౪॥ ఏకాక్షరీమహామంత్రం దేవస్యాపి
హనూమతః।షోడశాబ్జేచతుర్ష్వేవదళేష్వేవంవిలేఖయేత్॥౪౫॥
షోడశాబ్జే మహారమ్యే పత్రేషు ద్వాదశస్వపి। సువర్చలా
హనుమతో ర్లేఖయేద్ద్వాదశాక్షరీమ్॥ భూపురాణాం షోడశాబ్జే
దళానాం మధ్యభాగతః। అష్టాక్షరీమంత్రరాజం చతురాశాసు
లేఖయేత్॥ చతుర్వింశత్యక్షరం చ భూపురేషు విలేఖయేత్ ।
యథా మాతా సుతం రక్షేద్యథా యుద్ధేషు కంచుకం। తథా
రక్షేన్మహాయంత్రం తద్ గేహే యస్య చాస్తిచేత్॥ తాత్రమే

వా రజతే వాథ సువర్ణే వా విశేషతః। యంత్రం లిఖిత్వా ప్రాణస్య ప్రతిష్ఠా మాచరే త్తతః। సూర్యేందుగ్రహణే కాలే పుణ్యక్షేత్రే నదీతటే॥ అష్టోత్తరశతం సూర్యసంఖ్యాక్షరమనుం జపేత్। మధ్వాజ్యశర్కరాక్షీరై రభిషేకం సమాచరేత్॥ షోడశైరుపచారైశ్చ పూజయేద్యంత్ర ముత్తమమ్। సర్వ కామప్రదం నృణాం మందవారేవిశేషతః॥ ప్రత్యహంపూజయే ద్యంత్రం తత్ర లక్ష్మీరచంచలా। యంత్రపూజా యస్య గేహే తత్ర చోరాగ్నినాశనమ్॥ రక్షోభూతపిశాచేభ్యో భయం నాస్తి నసంశయః। రాజద్వారే రణద్వారే యంత్రధారీ న సీదతి॥ అరణ్యే వ్యాఘ్రసింహాద్యై నహితస్య భయం క్వచిత్॥

ఇతి పరాశరసంహితాయాం పంచముఖహనుమన్మంత్ర వివరణే పరాశరమైత్రేయ సంవాదే హనుమజ్జన్మకథా సువర్చలాహనుమద్ద్వాదశాక్షరీ మంత్రప్రభావ శతాననవధ హనుమద్యంత్రోద్ధార కథనం నామ సప్తమ పటలం సమాప్తమ్.

---

## అష్టమపటలప్రారంభః.

ధ్వజదత్తచరిత్రమ్॥ మైత్రేయః॥ పరాశర మహాప్రాజ్ఞ హనుమన్మంత్రవైభవమ్। భూయోఽపి శ్రోతుమిచ్ఛామి కృపయా వద మే ప్రభో॥ కేన చాదౌ పురా జప్తం హనుమన్మంత్ర ముత్తమమ్। కేనోపదిష్టం గురుణా కస్మై శిష్యాయ ధీమతే॥౨॥ కస్య సిద్ధిప్రదం శీఘ్రం జప్తం విశ్వాసపూర్వకమ్। విలంబితం ఫలం కస్య తత్సర్వం ప్రతిపాద్యతామ్॥ పరాశరః॥ ఇతిహాసం

మహాపుణ్యం స్తోత్రాణాంసర్వకామదమ్। సర్వపాపహరం
నృణాం నారీణాంవా విశేషతః। సనత్కుమారవదనాచ్ఛ్రు
త్వేమం బ్రహ్మసంసది।యథాశ్రుతం ప్రవక్ష్యామి శృణుష్వ ముని
సత్తమ ॥౫॥ పురా కృతయుగే భూమహా పుష్కరాఖ్యో మహా
మునిః సర్వశాస్త్రార్థతత్త్వజ్ఞః సర్వాగమ విశారదః।౬ శాంతో
దాంతస్సదాచారః శ్రద్ధావానసూయకః। సర్వవేదార్థసారజ్ఞః
సదామంత్రార్థతత్పరః ॥౭ఏవం సర్వగుణోపేతః హనూమా
న్భక్తిమాన్మునిః।కదాచిదాత్మనో జప్తుం హనూమన్మంత్రముత్త
మమ్॥౮॥ నైమిశారణ్యమాకీర్ణం సర్వైర్మునిగణైస్సదా। సిద్ధా
శ్రమమితిజ్ఞాత్వా సిద్ధయోగీ సమావిశత్ ॥౯॥ తత్ర గత్వామహా
యోగీ పుష్కరః పుష్కరేక్షణః। జజాప పరమం జప్యం
హనూమన్మంత్రముత్తమమ్॥ ౧౦॥ సిద్ధత్వాన్మంత్రరాజస్య
ఫలవ్యగ్రో న చాభవత్। నాపేక్షాం కురుతే తస్మిన్సదామంత్ర
రతో భవేత్॥ ౧౧॥ అథాస్మిన్నంతరే బ్రహ్మన్ ధ్వజ
దత్తాహ్వయో ద్విజః। వేదవేదాంగపారజ్ఞః దరిద్రో బహు
పుత్రవాన్॥ ౧౨॥ ఉపాదానరతో నిత్యం ప్రతిగృహ్ణాతి సద్గృ
హాత్। నాలం క్షుధార్తయే తస్య శిశూనాం ధాన్యమార్జితమ్॥
౧౩॥ శాకాహారేణతద్భార్యా జీవనంకురుతే స్వకం। శీలానామ
సుశీలా చ మహాసాధ్వీ కుటుంబినీ॥ ౧౪॥ కదాచిదపి నోవేత్తి
హ్యన్నం వా సిద్ధమాత్రకమ్। పాతివ్రత్యాద్వివేకాచ్చ సా నో
పాలభతే పతిమ్॥ ౧౫॥ నిజకర్మఫలం నూనం భోక్తవ్య మితి
జానతీ।పతిం శుశ్రూషమాణా సా న చకంపే క్షుధా సతీ॥ ౧౬॥
శోకమాత్రేణ నా సాధ్వీ బహుకాలం నినాయ హ। న వివేద

పతి స్త స్యాః శాకాహారం కదాచన ॥౧౭॥
అన్నం భుక్త్వావశిష్టం తు భోక్ష్యతీత్యేవమన్యతే। సాపిన
ప్రేయసీ ప్రాహ నాన్నం మే ఽస్తీతి భామినీ ॥౧౮॥ ధ్వజ
దత్తో మహాప్రాజ్ఞ ఉవాదాసరతోఽపి సన్ । అధ్యాపయ
న్బహూన్విప్రాన్ తిష్ఠ స్స బ్రహ్మచారిణః ॥౧౯॥ అథాసి
నోర్బహిర్వేదాద్యం పరీక్షాం కర్తుముద్యతః । సామగాన్
కతిచి ద్విప్రాన్ యాజుషా న్బహ్వృచానపి॥ ౨౦॥ అన్యానాథ
ర్వణాం శ్చైవ గాంధర్వానపి గారుడాన్॥ హనుమద్వేదశిరసి
నిష్ణాతా నపి వై ద్విజాన్॥ ౨౧॥ మండూకాన్నీకినీనాంశ్చ
తాన పరీక్షితవాన్ద్విజః । ఆహూతవా న్నిజం పుత్రం
ధ్వజద త్తః పరీక్షితుమ్॥ ౨౨॥ ఆహూతోఽపి న నిష్క్రాంతః
క్షుధార్తో మాతృసన్నిధేః । క్షుధితాపి మహాసాధ్వీ శాకా
హారం స్వకం దదౌ॥ ౨౩॥ పుత్రాయ క్షుధితాయాశు పరీక్షా
దీయతామితి ॥ పుత్రే చిరాయమాణే తు ధ్వజద త్త
ముపాగమత్ ॥ ౨౪॥ దదర్శ భక్షమాణం తం శాకం తన్మాతృ
సన్నిధౌ । అథాబ్రవీత్సపుత్రాం తాం ప్రేయసీం మితి
భాషిణీమ్॥౨౫॥ త్వయా కిం భక్ష్యతే సాధ్వి యతో నాయాతి
పుత్రకః । స్వవృత్తదర్శనాత్సాధ్వీ లజ్జితా చ ముహు
ర్ముహుః॥ ౨౬॥ ఉచ్యమానాపి భర్త్రా సా నోత్తరం ప్రతి
పద్యతే। విలంబాసహమానస్సన్ శాకంవాస్పర్శపాత్రతః ॥౨౭॥
అన్నాభావాదిదం భుక్తమితి నిర్విణ్ణమానసః ॥ సనిందాత్మాన
ముద్బుద్ధః ధిగ్జీవనమిదం మమ॥ ౨౮॥ శ్రుతం ధిఙ్మేఽఖిలం
శాస్త్రం ధిగాచార మితీరయన్ ॥ యత సాధ్వీ మహాప్రాజ్ఞీ
శాకాహారేణ జీవతి॥ ౨౯॥ అథోవాచ ప్రియాం విప్రః

దయయావిష్టచేతసః। దుఃఖగద్గదయా వాచా ప్రేయసీదైన్య
దర్శనాత్ ॥ ౩౦॥ యత్ర కుత్రాప్యటన్ భార్యే త్వన్ముఖాం
భోజదర్శనాత్ । విస్మృత్యాధ్వపరిశ్రాంతిం సద్యో నిర్వృతి
మాప్నుయాత్ ॥ ౩౧॥ స్త్రీణాం పుత్రః ప్రియో భర్తుః లోకే
సర్వత్ర దృశ్యతే। మయి తే తు పరా ప్రీతిః పుత్రేభ్యోఽప్యతి
రిచ్యతే॥ ౩౨॥ ప్రసన్నవదనా నిత్యం స్మితాపూర్వాభిభాషిణీ।
స్వప్నేపి ప్రతికూలత్వం న జానాతి హితైషిణీ॥ ౩౩॥ జలం
శాకం చ మూలం వా త్వయా సంపూర్ణచిత్తయా। దత్త
మశ్నామ్యహం నిత్యమమృతం దేవతా యథా॥ ౩౪॥యౌవనం
మధ్యమం లోకే ప్రసూత్యంతమితీర్యతే। బహుపుత్రాపి మాన్య
త్వం యథా షోడశవార్షికే ॥౩౫॥ వాసంతీమాలికావత్త్వం
యదా శయ్యా మధిష్ఠితా। తదాహం తృణవన్మన్యే గంధర్వీం
వా సురాంగనామ్॥ ౩౬॥ ఆనుకూల్యాచ్చ నారీణాం ప్రాతి
కూల్యం వరంస్మృతం। వియోగే ప్రతికూలాయాః పతిస్సంతోష
మృచ్ఛతి ॥ ౩౭॥ మత్పూర్వపుణ్యవిభవాత్తవ దుష్కృతకార
ణాత్ । మన్యే పాణిగృహీతాం మే భవంతీమమరాంగనామ్॥౩౮॥
అరుంధత్యా అహల్యాయా ద్రౌపద్యా అపి సువ్రతే। తారాయా
అపి సీతాయాస్సత్యాత్యాస్తథైవ చ॥ ౩౯॥ అన్యాసామపి
నారీణాం పాతివ్రత్యమనుత్తమమ్। ఇతిహాస పురాణాద్యైః
శ్రూయతే నైవ దృశ్యతే ॥౪౦॥ భవత్యాం తు విశేషేణ
కాలేన మహతా ప్రియే। పాతివ్రత్యపరాన్ధర్మాన్ దృష్టవానస్మి
సాంప్రతమ్॥౪౧॥కల్యాణగుణపూర్ణత్వాత్ పశ్యతోఽహర్నిశం
మమ। చక్షుస్మత్తేయమన్వర్థా చిరాయు చరితం ప్రతి ॥౪౨॥

సహస్రముఖ్యాయే శ్రీ శే తవ సౌందర్యమిశ్రితమ్। వర్ణితం తవ సౌశీల్యం సహస్రరసనా అపి॥ ౪౩॥ సహస్రం భుంజశాకాశ్చ తవాంగముపగూహితమ్। అతిసౌందర్యసాలేపిగర్వలేశోనచాస్తితే॥౪౪। నచావమన్యసే కాంశ్చిత్కురూపామపి భామినీమ్॥ తవ సౌందర్యసంపత్త్యా పాతివ్రత్యగుణేన చ॥ ౪౫॥ దారిద్ర్యమపి దుర్ధర్షన్ మనునన్యే కథంచన। ఈదృశీం భవతీం భార్యాం మామేవ ధ్యాయతీం సదా॥ ౪౬॥ విహాయ క్వ గమిష్యామి ప్రియే దారిద్ర్యకారణాత్ । మదీయం గృహమావిశ్య కిం ను భుక్తం త్వయా ప్రియే॥ ౪౭॥ ధర్మార్థకామమోక్షాణాం త్వంమూలమితినిశ్చయః॥అన్నపానైర్యథాకామం వస్త్రైరాభరణైరపి॥ ౪౮॥ న ప్రీణయతి యో భార్యాం స పుమాన్ పురుషాధమః। పితా రక్షతి కౌమారే భర్తా రక్షతి యౌవనే॥ ౪౯॥ పుత్రా రక్షంతి వార్ధక్యే న స్త్రీ స్వాతంత్ర్యమర్హతి। అనుకూలా ప్రియా సాధ్వీ యస్యాస్తినిజమందిరే॥౫౦॥ తదేవ భవనం నోచే ద్యథారణ్యం తథా గృహమ్। పతివ్రతా సుశీలా చ సురూపా సాధుభాషిణీ॥ ౫౧। కులజా భవతీ సాధ్వీ కథం త్వాం త్యక్తుముత్సహే। సాధ్వీ భార్యా చ యస్యాస్తిస మాన్యో బంధుభిర్జనైః॥ ౫౨॥ స ఏవ పురుషః శ్లాఘ్యస్స యోగ్యస్సర్వకర్మసు। వృద్ధౌ చ మాతాపితరౌ సాధ్వీ జాయా సుతశ్శిశుః॥ ౫౩॥ అప్యకార్యశతం కృత్వా భర్తవ్యా మనురబ్రవీత్ । పఙ్క్తిభేదీ పృథక్పాకీ నిత్యం బ్రాహ్మణదూషకః॥ ౫౪॥ విప్రద్రవ్యాపహర్తా చ బ్రహ్మహంతా తథైవ చ। ఏతే చతుర్దశ ప్రోక్తాః మహాపాతకసంజ్ఞకాః ॥౫౫॥

తస్మా దుపేక్షమాణస్య సాధ్వీం త్వాం హితభాషిణీమ్।ప్రాయ శ్చిత్తోపదేశం మే వక్తుమర్హాసి సాంప్రతమ్॥౫౬॥ ఇతి నిందిత మాత్మానం ఖిద్యంతం చ పునః పునః। భర్తారం ప్రాహ సా సాధ్వీ కిమర్థం ఖేద ఈదృశః॥౫౭॥ఉచితం కిం మహాప్రాజ్ఞ ధీరో దాత్తస్య తే ప్రియా। సర్వశాస్త్రార్థ తత్త్వజ్ఞ కిమర్థం కథ్యతే ప్రభో॥౫౮॥ నిజకర్మాణి సర్వాణి భోక్తవ్యాని న సంశయః। ఈదృశా న్యేవ కర్మాణి కృతాన్యస్మాభిరంజసా। కణ మాత్రం జలం వాపి అన్నం వా సిద్ధమాత్రకమ్। సత్పాత్రే నార్పితం యస్మా త్తస్మాద్దారిద్ర్యమాగతమ్॥ ౬౦॥ కో వా విచారయేదర్థే అవశ్యంభావినీదృశే। తస్మాద్వివేకిన స్తత్ర విచారో నైవ సాంప్రతమ్॥ ౬౧॥ ఇత్యుక్త్వా వచనం సాధ్వీ పాదయోర్న్యపతత్తదా॥ నిపతంతీం నిజాం భార్యామాలింగ్యచ పునఃపునః॥ ౬౨॥ ఆదృత్య సాంత్వవచసా దేశకాలోచితేన సః। ఆదాయ దేవతాం స్వాంచ ఉపాదాన పరో యయౌ॥ ౬౩॥ తదేవ చింతయానస్య గచ్ఛతో దిశము త్తరామ్॥చింతాసముద్భవ త్తస్య ధ్వజద త్తస్య ధీమతః ॥౬౪। తనుసా వా మహోగ్రేణ వేతనేనాథవా పునః। యజనాధ్యాపనాభ్యాం వా ఆనయిష్యే ధనం బహు॥ ౬౫॥ ఇతి ముదితమనా ఉపాయయోగాన్నిజ సుఖలేశ పరాఙ్ముఖాభిమానః। జ్వలితహుతభుజం ప్రభాత కాలే మునివనమండల మధ్యగాద్ద్విజేంద్రః॥౬౬॥

ఇతి శ్రీపరాశరసంహితాయాం ధ్వజద త్తచరిత్ర కథనం
నామ అష్టమపటలం సమాప్తమ్.

శ్రీపరాశరసంహితాయాం నవమపటల ప్రారంభః

మైత్రేయః॥శ్లో॥ కిమకార్షీ ద్వనం గత్వా ధ్వజదత్తః పరాశర।తద్వనంచా కిమాఖ్యాతంతన్మే బ్రూహిమహామునే॥౧॥ శ్రీపరాశరః-తద్వనం నైమిశారణ్యంయత్రాస్తేపుష్కరోమునిః యత్రాసతే మునివ్రాతా అపరే కశ్యపాదయః ॥౨॥ జపంతో భవ్యమంత్రాంశ్చ ధ్యాయంత శ్చేష్టదేవతాః । ప్రాయశో హనుమద్భక్తా స్తన్మంత్రజపతత్పరాః॥ 3 । నిత్యహోమపరాః కేచిత్ కామ్యహోమ పరాః పరే । అన్యే కర్మపరిత్యక్తాః కేవలధ్యానతత్పరాః॥౪॥ ఇత్యేవం వివిధై ర్వ్యాప్తం బహుభి ర్మునిపుంగవైః । ధ్వజదత్తో వనం వీక్ష్య విస్మయం పరమం యయౌ ॥ ౫ ॥ దంతధావనపర్ణాని సమిత్పుష్పఫలాని చ ॥ గృహీత్వా నిజపాణిభ్యాం ప్రవిష్టో వనగహ్వరమ్ ॥ ౬ ॥ యత్రాస్తే పుష్కరో యోగీ హనుమద్ధ్యానతత్పరః । సూర్య బింబసమజ్యోతి ర్హనుమన్మంత్రవైభవాత్ ॥౭॥ తం దేశగమ ద్దీప్తం శనైర్భీతో మహాత్మనః । తూష్ణీం తస్థౌ తదభ్యాసే విస్మృత స్వార్థసంభ్రమః॥ ౮॥ యదృచ్ఛయా మునీంద్రోపి మాధ్యాహ్నిక ముపాసితుం।నివృత్తయోగం తత్రైవంనివృత్త స్యాంతికే ద్విజమ్॥ ౯॥ ధ్వజదత్తో మహాప్రాజ్ఞో వీక్ష మాణే మహాత్మని। ఉపహారం నివేద్యాదా వష్టాంగం ప్రణ తో౽భవత్॥ ౧౦॥ అథాబ్రవీన్మహాభాగో ధ్వజదత్తద్విజ ర్షభః। కిమర్థమాగతో బ్రహ్మన్ కేన వాపకృతో భవాన్ ॥౧౧॥ నిర్విణ్ణవదనో భూత్వా చింతాక్రాంత ఇవ స్థితః। ఏత త్సర్వం యథావృత్తం విచార్య బ్రూహి తత్త్వతః॥ ౧౨॥

శ్రుత్వా తద్వచనం విప్రః పృష్టః స్యమహాత్మనః। ప్రత్యుత్తరం యథాన్యాయం వక్తుం సముపచక్రమే॥ ౧౩॥ కుండినం నామ నగర మాసీ త్త్రైలోక్యవిశ్రుతం। యత్రాఢ్యా వర్ణ జానిత్యం కుబేరాధికసంపదః॥౧౪॥ బ్రాహ్మణాశ్చాఽపి విద్వాంసస్సురరాజ గురూపమాః। నిత్యాన్నదాననిరతా నిత్యహోమపరాయణాః॥ స్త్రియః పతివ్రతా స్సర్వా శ్శూద్రా బ్రాహ్మణసేవకాః। క్షత్రియా ధర్మయోద్ధారో న క్వచి ద్వర్ణసంకరః ॥౧౬॥ నాభూతవిద్వా న్యః కోఽపి నావాదకుశల స్తథా। నోపకుంగ విప్రత్రాసీన్న యజ్వాత్రత్ర పట్టణే॥ ౧౭॥ ఏవం సర్వసమృద్ధేస్మిన్ ధ్వజశర్మా బహుశ్రుతః। బహ్వృచో గార్గ్య గోత్రశ్చ జితాంతర్బాహ్యశాత్రవః॥ ౧౮॥ తస్యాహం జ్యేష్ఠపుత్రశ్చ కనీ నాన్మమ భద్రకః। తస్యానుజో భద్రబాహుస్సర్వవేద పరాయణః॥ ౧౯॥ అనుజౌ తౌ మహాపుర్యా ముపాదానపరా యణౌ। తేషాం మమాపి పుత్రాశ్చ నాలం తస్యత్రాంతయే మునే॥ ౨౦॥ పుత్రాశ్చ బహవస్సంతి సాధ్వీ భార్యా ప్రియం వదా। ఉపాదానార్జితం ధాన్యం నాలం గ్రాసాయ నో మునే॥ ౨౧॥ శాకాహారేణ సా సాధ్వీ జీవనం కురుతే భృశమ్। ఉప వాసపరా ప్రాయః శాకాభావే పతివ్రతా ॥౨౨॥ తద్దైన్య దర్శనా ద్దేవః కదాచిచ్చ తనూనపాద్। ఆశ్వాస్య తాం ప్రియాం వాక్యై ర్వంచయిత్వాహమాగతః ॥ ౨౩॥ తస్మాద్గురిర్భిక్షు హంతారం సర్వసౌభాగ్యదాయకం। సర్వదుఃఖహరం చాపి హ్యుపాయం వక్తుమర్హసి॥ ౨౪॥ బహునాఽత్ర కిము క్తేన మమైతద్వచనం శృణు। దారిద్ర్యసాగరే మగ్నా నస్మాను

తా॥ ఓ దూతా నీవు ఇంద్రునిలోకమునకు వెళ్ళినటు వంటివాడవై (నావాక్యములుగా) ఇంద్రునితో చెప్పుము. మా పెత్తండ్రిగారైన దశకంఠుడు ఒకప్పుడు నీతో యుద్ధము చేయుటకు వచ్చెను. నీవున్ను క్రోధముతో యుద్ధముచేసితివి. మీరిరువురు గొప్ప యుద్ధము చేయుచుండగా మా అన్నగారైన మేఘనాదుడు నిన్ను కట్టివేసి లంకకు తీసుకువచ్చెను. ఆసమయమందు బ్రహ్మదేవుడు వచ్చి బతిమాలుకొని మేఘనాదునకు 'ఇంద్రజిత్' అను బిరుదమునున్ను అనేక వరములనున్ను ఇచ్చి నిన్ను విడిపించుకొనిపోయెను. ఆసందర్భము నీకు తెలిసియేయున్నది.

శ్లో॥ తస్మాద్యోద్ధుం న తేశక్తి ర్దేహి దేవ భవాన్మమ ॥౪౮॥ చింతామణ్యాదికం దివ్యరత్నజాతమనుత్తమం। కామధేనుం చ దేహీతి దూతస్తత్ప్రహితో యయౌ ॥౪౯॥

తా॥ ఆ కారణముచేత నీవు నాతో యుద్ధముచేయుటకు శక్తిలేదు గనుక చింతామణిని్ని కామధేనువునున్ను కల్పవృక్షమునున్ను నాకు యివ్వవలసినది అని చెప్పుమనెను. అనిన, ఆ దూత ఇంద్రునితో చెప్పుటకై వెళ్ళెను.

శ్లో॥ అథ గత్వామరావాసం దదర్శ చ శచీపతిం। మహాద్రిపక్షవిచ్ఛేదనక్షమం బిభ్రతం పవిమ్ ॥౫౦॥ పులోమజాలసద్వామపార్శ్వం నిర్జరసేవితం। గంధర్వోద్గీతసద్గీతం బృహస్పతికృతాశిషమ్ ॥౫౧॥ వళ్యంతమప్సరోలాస్యం భ్రాజమానం సభాంతరే। తతో నీలాసురేణోక్తం కథయామాస గర్వతః ॥౫౨॥

తా॥ వెళ్ళినటువంటివాడై వజ్రాయుధమును ధరించినటువంటివాడును శచీదేవితో కూడినటువంటివాడును దేవతలచే సేవింపబడువాడును అప్సరః స్త్రీల నాట్యమును చూచుచున్నవాడును బృహస్పతియొక్క ఆశీర్వచనమును పొందుచున్నవాడును సభాస్థలియందు దేవతలు మొదలైనవారితో కూడుకొనియున్న దేవేంద్రుని చూచి గర్వముతో నీలుని యొక్క దూత యీ వాక్యములను పలికెను.

శ్లో॥ శ్రుత్వా దూతేరితం వాక్యం కోపాదూచే శతక్రతుః। బలపాకాదిజంభాద్యా మత్కరాశనిహా హారాః॥౫౩॥

తా॥ దూతపలికిన వాక్యములను దేవేంద్రుడు విన్నవాడై కోపోద్రేకముతో, బలాసురుడు పాకాసురుడు జంభాసురుడు మొదలగు రాక్షసులు నాచే కొట్టబడిరిసుమా.

శ్లో॥ పాతాళే చ భయచ్ఛన్నాః కేచి త్తేష్వయమాసురః। దైత్యేషు కేవ వాతుల్య స్సంరంభాతిశయోజ్జ్వలమ్ ॥౫౪॥ వజ్రం దధానం మామత్ర ప్రపశ్యతు పురందరమ్॥

తా॥ కొంతమంది రాక్షసులు భయమునుపొంది పాతాళమునందు డాగిరి. అటువంటి రాక్షసులలో వీని లెక్కయేమి? కోపముతో వజ్రాయుధమును ధరించిన ఈ దేవేంద్రుని మీ నీలుడు యుద్ధమందు చూడగలడు.

శ్లో॥ శతకోటిప్రహారస్య శతకోటిసురారయః ॥౫౫॥ న శక్తాస్సహనే యుద్ధే కీదృశోఽమే పురోఽసురః॥

తా॥ యుద్ధమందు శతకోటిరాక్షసులకైనను దేవేం
ద్రుని యెదుర్కొన శక్యముగాదు. ఈనీలుడు యెంతటివాడు?

శ్లో॥ ఉక్త్వా దూతం ససంరంభమవాదీత్పార్శ్వ
వర్తినమ్ ॥౫౬॥

తా॥ అని ఈ ప్రకారముగా నీలునిదూతతో పలికి
ఇంద్రుడు తనదూతను జూచి పలికెను.

శ్లో॥ దూతస్య హింసా నో కార్యా తదస్య కరబం
ధనం । కృత్వా వితనుత క్షిప్రం శిఖాచ్ఛేదమహంకృతః ॥౫౭॥

తా॥ ఓదూతలారా దూతను హింసించకూడదు గనుక
అహంకారము కలిగిన ఈదూతను కట్టివేసి శిఖాచ్ఛేదమును
చేయవలసినది.

శ్లో॥ శ్రుత్వాచ తేతథా చక్రు స్సచ ఖేదం పరం గతః।
ఆతుర స్తత్క్షణం గత్వా ప్రచఖ్యౌ నీలరక్షసే॥ ౫౮॥

తా॥ ఇంద్రునియొక్క వాక్యమును విని ఇంద్రదూతలు
నీలునియొక్క దూతకు శిఖాచ్ఛేదనముచేసిరి. అంత, అవమా
నముచే ఖేదముకలవాడై యాదూత శీఘ్రముగా వెళ్ళి
నీలునితో చెప్పెను.

శ్లో॥ స చాతికుపితో ఘోరం భేరీంసనదభిన్నదిక్ । రథ
కేతూత్థపవన జాలక్షుభ్యన్నదీజలః॥ ౫౯॥ కరస్ఫురితకాక్షేయ
రుచిచ్ఛన్నజనేక్షణః । సేనాంగచరణాఘాతచూర్ణీకృతగిరిస్థలః
॥౬౦॥ స్వసైన్యైః ప్రస్థలద్దైన్యైశ్చలితమన్యముపాద్రవత్ । గత్వా

విలయకాలోత్థమేఘ స్తనిత భీకరమ్ ॥౬౧॥ అట్టహాసం చకా రోచ్చై ర్చిర్వ్యక్షుర్ది గధీశ్వరాః । ససైన్యాన్సహసా గత్వా పరి వవ్రుర్బలాంతకమ్॥ ౬౨॥

తా॥ ఆ వాక్యములను విని నీలుడు కోపగించినవాడై భేరీధ్వనులచే దిక్కులను బ్రద్దలు చేయుచున్నవాడును రథమునకు కట్టబడిన జెండాలయొక్క వాయువులచే కదల్ప బడిన నదీజలముకలవాడున్నూ ఆయుధము ధరించినవాడున్ను సైన్యములయొక్క నడకలచే చూర్ణముగా చేయబడిన పర్వ తములుకలవాడున్నూ దైన్యమును వదలినవాడున్నూ అగుచు అట్టహాసముచేయుచు బయలుదేరిన, దానిజూచి భయముకల వారై దిక్పాలకులు ఇంద్రుని చుట్టుకొనిరి.

శ్లో॥ తైస్సమేతః స్ఫురత్తీవ్రధారవజ్రలసత్కరః । జగామాయోధనభువం జిష్ణుః పార్శ్వగతామరః ॥౬౩॥

తా॥ అంతట దిక్పాలకులతోటన్నీ సైన్యములతోటన్నీ దేవతలతోటన్నీ కలసినవాడై ఇంద్రుడు యుద్ధభూమిని ప్రవే శించెను.

శ్లో॥ అథాదితేయదైత్యానాం బభూవాయోధనం మహాత్ । జగతాం భయదం భూరి సింహనాదసమా కులమ్ ॥౬౪॥

తా॥ అనంతరము దేవదానవులకు భయంకర మగు యుద్ధము జరిగెను.

శ్లో॥ తారాః పేతురథ క్షీణా వార్ధయశ్చేతసుర్భ్రమన్ । యయౌ దిక్ష్వథాత్మూర్యశ్చచాల చ వసుంధరా॥ ౬౫॥

తా॥ అట్టియుద్ధసమయమునందు నక్షత్రములురాలెను. సముద్రములు ఇంకెను. చంద్రుడు తిరిగిపోయెను. సూర్యుడు ఇతరమార్గమున నడిచెను. భూమి కదలెను.

శ్లో॥ వపుర్మహానిలా నేముః ఫణీంద్రస్య ఫణా జవాత్ ॥

తా॥ గొప్పవైన వాయువులు వీచినవి. ఆదిశేషుని వెయ్యిపడగలు వంగినవి.

శ్లో॥ ఏవం ప్రవృత్తే తుములే సంయుగే సురరక్షసామ్ ॥ ౬౬ ॥ నిర్మాయ మాయామసురాన్సురాన్మగ్నాని వాంబుధౌ। విధాయ మోహితాన్సర్వాన్సింహనాదాన్ప్రచక్రముః ॥ ౬౭ ॥

తా॥ ఈప్రకారముగా దేవదానవులకు భయంకరమగు యుద్ధము జరుగుచుండగా రాక్షసులు మాయను నిర్మించి దేవతలను ఉదకములయందు ముంచివేసి మోహితులనుగా చేసి సింహనాదము చేసిరి.

శ్లో॥ అశక్తాశ్శస్త్రాతుమమరాః పలాయంతదిశో భయాత్। మఘవాన్వీక్ష్య సకలానమరాన్నోపదీపితః। ౬౮ ॥ ఘోరారిభేరీరవణమారుహ్య ధవళం గజం। వహ్నిత్యర్థిమర్మదళనం కులిశం పాణినా దధత్ ॥ ౬౯॥ దైత్యానాం గణహుంకారైరహంకారం విజృంభయన్ । జంభారిరభ్యయాన్నీలం రయాద్దానవనాయకమ్॥౭౦॥ అబ్రవీచ్చ సమాసాద్య రాక్షసాధిపతింపునః॥

తా॥ ఇట్లు సింహనాదముచేసిన రాక్షసులను జూచి యెదిరించుటకు భయపడి దేవేంద్రుని భటులు పారిపోయిరి. అంత దేవేంద్రుడు కోపాతిశయముకలవాడై వజ్రమును ధరించి యైరావతమునుయెక్కి నీలుని యెదుర్కొని ఇట్లు పలికెను.

శ్లో॥ మదాత్మసంభవో వాలీ త్వత్పితృభ్రాతరం పురా ॥20॥ లాంగూలాగ్రేణ తం బద్ధ్వా రావణం వారిరాశిషు। మజ్జయామాస తత్సర్వం పితృవ్యాన్న శ్రుతంకిము ॥21॥

తా॥ ఓ నీలుడా నా కుమారుడైన వాలి మీ పెదతండ్రి యైన దశకంఠుని వాలాగ్రముచే బంధించి సముద్రములయందు ముంచివేసెను. ఆ సంగతి నీకు మీ పెదతండ్రి యెన్నడూ చెప్పియుండలేదా ? అని పలికిన—

శ్లో॥ శక్ర త్వామగ్రహీద్యుద్ధే మేఘనాదో మదగ్రజః। స్వగృహం చానయద్బద్ధ్వా చేంద్రజిద్బిరుదాంకితః ॥23॥

తా॥ దేవేంద్రునిజూచి నీలుడు పలుకుచున్నాడు :- ఓ దేవేంద్రుడా మా అన్నగారైన మేఘనాదుడు యుద్ధమధ్యమందు నిన్ను బంధించినవాడై గృహమునకు తీసుకొనివచ్చి 'ఇంద్రజిత్' అను బిరుదమును పొందలేదా? ఈ సంగతిమూడు లోకములకు తెలుసును ఆసంగతి మరచితివా? (బలపౌరుషములు గణనచేయవలసివచ్చినప్పుడు నీ గొప్పతన మేమియు లేదు. గౌతమునిభార్యకు జారుడవై కోడికూత కూసితివిగదా ? ఇదిసర్వ లోకవిదితముగాదా ? నీ పౌరుషము ఇట్టిదియేకదా?)

శ్లో॥ ఇతిసోల్లుంఠవాన్యుక్త్వా సజ్యం కృత్వా సకార్ముకం।
నీలో విధాయ ధనుషా బాణాన్ప్రయుంక్త వాసవే ॥౭౪॥

తా॥ అని నీలుడు పరిహాసవచనములు పలికి ధనుస్సును ఎక్కుపెట్టి ఇంద్రునిమీదికి బాణములు ప్రయోగించెను.

శ్లో॥ సచ్ఛిత్వా తాన్ శరాద్బాణై స్తనుశ్చిచ్ఛేద రక్షసః।
సోన్యం గృహీతవాంశ్చాపం బహుధేంద్రోభినచ్చ తమ్ ॥౭౫॥

తా॥ అట్లు ప్రయోగించిన నీలునిబాణములను ఇంద్రుడు బాణములచే ఛేదించెను. నీలుడుమరియొక బాణమును ప్రయోగించెను అదియును ఇంద్రుడు తునిమెను.

శ్లో. నీలోథ చంద్రహాసేన దంభోళిం కుంఠితం వ్యధాత్ । తతశ్శచీపతిః కోపాదవరుహ్య గజాత్ప్రభిః ॥౭౬॥ గృహీత్వా తేన దేవారిమాజఘాన ఘనధ్వనిః॥

తా. ఇంద్రుడు కోపగించినవాడై ఐరావతమునుండి దిగి మేఘధ్వనిచేయుచు అంకుశముచే నీలుని కొట్టెను.

శ్లో. గదామాదాయ స తదా బభంజాంకుశమాశరః ॥౭౭॥ శక్రం గృహీత్వా ఖడ్గేన నీలో హంతుం సముద్యతః॥

తా. నీలుడున్నూ తనగదచే దేవేంద్రుని అంకుశమును త్రుంచి ఖడ్గముబూని ఇంద్రుని సంహరించుటకై చేయి యె త్తెను.

శ్లో. విదిత్వా తత్క్షణాదేత్య విధిర్మా సాహసం కురు ॥౭౮॥ ఇత్యుక్త్వా తత్కరం రుద్ధ్వా తరసా తమువోచత॥

తా. ఆసమయమునందు బ్రహ్మదేవు డావృత్తాంత మును తెలుసుకొని యుద్ధభూమియందు ప్రత్యక్షమై, ఓనీలుడా సాహసింపకుము. అని నీలునిచేయి పట్టుకొని—

శ్లో. నీల నీలాపతే ర్భక్త్తో జనక స్తే విభీషణః ॥౭౯॥
ముకుందస్యాగ్రజశ్చాయం మహేంద్రఃశృణు మే వచః॥

తా. ఓనీలుఁడా విష్ణుమూర్తికి నీతండ్రి భక్తుఁడు. విష్ణుమూర్తికి ఇంద్రుడు అన్న గారు. అనినీలునితో చెప్పి కోపమును తగ్గించినవాడై దేవేంద్రుని చూచి, నీకు క్షేమకరమగు ఒక వాక్యమును చెప్పుచుంటిని వినుమని పలికెను.

శ్లో. మైత్రీం విధాయ విపులాం త్వమనేన వవిం త్యజ॥ ౮౦॥

తా. ఓదేవేంద్రుడా ఈనీలునితో స్నేహమును చేయుము వజ్రాయుధమును విడువుము. అనిచెప్పి నీలుని జూచి—

శ్లో. చింతామణిం కల్పతరుం కామధేనుమహంచ తే।
ప్రదాస్యే దేవరాజేన మైత్రీయుక్తస్సదా భవ॥ ౮౧॥

తా. ఓనీలుడా చింతామణినిన్నీ కామధేనువునున్నూ కల్పవృక్షమునున్నూ నీకు ఇచ్చెదను. నీవు ఇంద్రునితో స్నేహయుక్తుడవు కావలసినది.

శ్లో. అన్యచ్చ శృణువక్ష్యామి విభీషణవరాత్మజ।
పూర్వం హిమాచలే తీవ్రం చచారాత్రిర్మహత్తపః ॥౮౨॥

తన్నేత్రాదుదభూచ్చైచ్చకం దివ్యం తేజ స్తపోమయం । తద్వై వృక్షేషు బహుధా జర్జరం మారుతః స్వయమ్ ॥౮౩॥ రాశి ద్వయం చకారాథ చంద్ర స్త త్రైకరాశితః । సౌందర్యైకనిధి ర్జజ్ఞే ద్వితీయాద్రాశితి స్తతః ౮౪॥ త్రిలోకకన్యకాశ్రేష్ఠా కన్యా చ వనసుందరీ॥

తా. నీలుడా ఇంకొకవాక్యమును చెప్పుచుంటినివినుము. పూర్వకాలమున అత్రిమహాముని హిమవత్పర్వతమందు గొప్ప తపస్సు చేసెను. అయన నేత్రమువల్లనుంచి దివ్యమైన తేజస్సు బయలుదేరి వృక్షములయందు వ్యాపించెను. ఆ తేజస్సును వాయుదేవుడు రెండుభాగములు చేసెను. ఒకరాశివలన సుందరరూపుడగు చంద్రుడుద్భవించెను. రెండవరాశివలన త్రిలోకసుందరియగు వనసుందరి ఉద్భవించెను.

శ్లో॥ ఓషధీశ స్తతో జాతశ్శంభోర్మూర్ధని భూషణమ్ ॥౮౫॥ మధునావర్ధయత్తాం తు కన్యకాం వనసుందరీమ్ ॥

తా॥ అట్లు ఉద్భవించిన చంద్రుడు ఈశ్వరునిశిరస్సున ధరింపబడినవాడాయెను. రెండవదియగు వనసుందరిని తేనె చేత వృద్ధిపొందించెను.

శ్లో॥ దుహితృత్వం గతైతస్య ప్రాప్య సంపూర్ణయౌవనమ్॥ ౮౬॥ అతులేన చకోరాక్షీ సౌందర్యేణ విరాజతే॥

తా॥ ఈచంద్రునికి ఆచిన్నది చెల్లెలుగానున్నది సుమా. యౌవనముకలదియై ఉపమానములేని సౌందర్యముతో ప్రకాశించుచున్నది.

శ్లో॥ తాం చ దేవీం ప్రదాస్యామి చింతామణ్యాదిభి స్సహా ॥౮౭॥

తా॥ ఓనీలుడా చింతామణ్యాదులతో సహా ఆ చిన్న దానిని నీకు ఇచ్చెదను.

శ్లో॥ భవతో పాసితా విద్యా సర్వసింహాసనేశ్వరీ। శ్రీరామ సచివాగ్రస్య సాక్షాచ్ఛ్రీహనుమత్ప్రభోః॥౮౮॥ వ్రతం కృతం హనుమతో నక్షత్రే మృగశీర్ష కే॥

తా॥ నీవు మృగశీర్ష నక్షత్రమందు హనుమద్వ్రతమును చేసినవాడవును పంచముఖహనుమద్విద్య నుపాసించినవాడవును గనుక నీకు సాధింపరాని కార్యము లేదు.

శ్లో॥ అస్మదాదిభిరభ్యర్చ్య స్తేనాసి సుమహామతే।౮౯।

తా॥ ఆహనుమద్విద్యనుపాసించుటచేతనే మావంటివారలచేతనున్నా పూజింపతగినవాడవు.

శ్లో॥ రహస్యమన్యద్వక్ష్యామి సద్యస్సకలసిద్ధిదం।మయా నోక్తమితః పూర్వం యస్య కస్యాపి సువ్రత॥ ౯౦॥ మాఘే శ్రీరుద్రదైవత్యే ఫాల్గునేదితిదైవతే। చైత్రే పుష్యేఽర్క నక్షత్రే పూజయేద్ధనుమత్ప్రభుమ్ ॥౯౧॥ జ్యేష్ఠమాస్యథవా కుర్యాద్వ్రతం నక్షత్రపంచకే॥

తా. ఓ నీలుడా యెవ్వరికి చెప్పరాని రహస్యమును చెప్పాచుంటిని వినుము. మాఘమాసమున ఆర్ద్రానక్షత్ర మందున్నూ ఫాల్గునమాసమందు పునర్వసునక్షత్రమందున్నూ

చైత్రమాసమందు పుష్యమీనక్షత్రమందుగాని హస్తానక్షత్రమందుగాని జ్యేష్ఠమాసమునందు మృగశిర ఆర్ద్ర పునర్వసు పుష్యమి హస్తలయందున్నూ ఈ హనుమద్వ్రతమును చేయవలెను.

శ్లో॥ పూర్వోక్తస్యైవ దోరస్య పూజాం కుర్యాద్దినే దినే ॥౨॥ ఏకభుక్తో హ్యథశ్వాయీ బ్రహ్మచారీ జితేంద్రియః । జపేదష్టోత్తరశతం పంచవక్త్రమహామనుమ్ ॥౩॥ యం కంచిదపి తన్మంత్రం జపేత్సర్వాదినేష్వపి । విప్రేభ్యః పంచ సంఖ్యేభ్యో దద్యాద్వాయన ముత్తమమ్ ॥౪॥ అపూపపంచకం నీల ఫలపంచకసంయుతమ్ । ఆచార్యం పూజయేత్పశ్చాద్విత్తశాఠ్యవివర్జితః ॥౫॥ పూజయేద్వటుకాన్ పంచబ్రాహ్మణానపి భోజయేత్ ॥

తా॥ పూర్వమునందు చెప్పబడిన దోరమును పూజింపవలెను. ఏకభుక్తవ్రతము బ్రహ్మచర్యము చేయవలెను. ఆంజనేయమంత్రమును అష్టోత్తరశతము జపించవలెను. అయిదు అయిదు అప్పములు, అయిదు అయిదు ఫలములతో అయిదుగురు బ్రాహ్మణులకు వాయనదాన మీయవలయును. విశేష ద్రవ్యములచే గురువును పూజింపవలెను. అయిదుగురు బ్రహ్మచారులకు పూజచేసి బ్రాహ్మణ సమారాధనమును శక్తికొలది చేయవలయును.

శ్లో॥ అస్మిన్కృతే కృతే సాక్షాద్ధనూమత్కథయా
ఽన్వితే ॥౯౭॥ ఆయురారోగ్యమతులం ధనధాన్యాదిసంపదః।
విజయః పుత్రపౌత్రాశ్చ సౌభాగ్యమమలం శుభమ్ ॥ ౯౮ ॥
కిము క్తేనాత్ర బహునా సర్వసిద్ధిర్భవిష్యతి ॥

తా॥ ఈ వ్రతమును చేయునప్పుడు కథాశ్రవణమును చేయవలయును. ఈ వ్రతమును ఆచరించుజనులు ఆయురారోగ్య ధన ధాన్యములున్నూ పుత్రపౌత్రులున్నూ కలవారగుదురు. సకలకార్యసిద్ధులు చేకూరును.

శ్లో॥ తస్మాత్త్వం కురు యత్నేన వ్రతమేతదనుత్తమమ్ ॥౯౯॥ భవిష్యతి మహాసిద్ధి స్సతతం విజయప్రదా । శతవర్షసహస్రాణి భుక్త్వా భోగాన్మనోరథాన్ ॥౧౦౦॥ ఎకాంశేనాపి వైకుంఠే భగవత్కింకరాగ్రణీః । నీలాద్రిరితి విఖ్యాతం క్షేత్రం శ్రీపురుషోత్తమమ్॥౧౦౧॥ జగన్నాథప్రియో భూత్వా చైకాంశేనమహీతలే । దర్శనాన్ముక్తిదో నౄణాం సుందర్యా సహ సంతతమ్ ॥౧౦౨॥ కీర్తిస్తే లోకవిఖ్యాతా భవిష్యతి న సంశయః ॥

తా॥ ఓ నీలుడా ఈ వ్రతమును నీవు తప్పక చేయుమా. నీకు మహాసిద్ధి కలుగును. అనేక వేలసంవత్సరములు ఇహలోకమునందు భోగములను అనుభవించి అంతమందు నారాయణునికింకరుడవు కాగలవు. ఈ ప్రదేశము 'నీలాద్రి' అని పేరు పొందును. పురుషోత్తమక్షేత్రమనియు పేరును పొందును. నీవు విష్ణుమూర్తికి ఇష్టుడవై వనసుందరితో కలుసుకుని విశేషకీర్తిని గాంచగలవు.

శ్లో॥ ఇత్థం బహూన్వరాన్లబ్ధ్వా సీతో రత్నాదిభిస్సహ
॥౧౦౨॥ భుక్త్వా భోగాన్మహాయోగీ భగవత్కింకరోభవత్ ॥

తా॥ ఇట్లు బ్రహ్మదేవునివల్లనుంచి అనేకవరములను పొంది ఇహలోకమునందు అనేకభోగములననుభవించి అనంతరము వైకుంఠమును పొందెను.

ఇతి హనుమద్వృత్తకథాయాం సీతాచరిత్రకథనం నామ చతుర్థోధ్యాయః
సమాప్తః.



# ఫలశ్రుతిః

శ్లో॥ హనూమతో వ్రతస్యాయం ప్రభవో ముని పుంగవ । శ్రుతో వా పఠితో యైశ్చ సర్వదా విజయప్రదః ॥౧॥

తా॥ ఓ మైత్రేయా ఈహనుమద్వ్రతమహిమ ఇట్టిది సుమా. ఈవ్రతమాహాత్మ్యమును వినినను పఠించినను జయ మును పొందుదురు.

శ్లో॥ అథాన్యత్సంప్రవక్ష్యామి సర్వవ్రత ఫలప్రదం। వ్రతం హనుమతో గోప్యం సద్యో విజయసిద్ధిదమ్ ॥౨॥ ఆదిత్య హ సనక్షత్రే పూర్వవద్భోజయే ద్విభుం । ఫలాది వా హవి ష్యాశీ క్షీరాహారోఽథవా మునే ॥3॥

తా॥ ఇంకొకరహస్యమును చెప్పుచుంటిని వినుము. సమస్తసిద్ధులను ఇచ్చే హనుమద్వ్రతమును ఉపవసించిగాని క్షీరాహారుడై గాని ఫలభక్షకుడై గాని హవిష్యమును భక్షించి గాని ఆదివారముతో కూడిన హస్తానక్షత్రమునందు చేయ వలయును.

శ్లో॥ వర్షే సమాప్తే దోరంతు ధారయేదన్యదుత్తమమ్॥ హస్తార్కే కురుతే యస్తువ్రత మేత దనుత్తమమ్ ॥౪॥ పరేద్యు ర్వాయనం దత్త్వా గురుం సంపూజ్య యత్నతః । హనుమ త్కథయా యుక్తస్సతతం విజయీ భవేత్ ॥౫॥

తా॥ సంవత్సరాంతమందు పాతదోరమును విసర్జించి కొత్తదైన దోరమును విధ్యుక్తముగా పూజించి ధరించవలెను.

హస్తానక్షత్రముతో కూడిన ఆదివారమునందు హనుమద్వ్రత మును వ్రతకథా కాలక్షేపమున్నూ చేసి మరునాడు వాయనదానముచేసి తరువాత బ్రాహ్మణ సమారాధనము మొదలగునవి చేయవలెను. అనగా ఆదివారముహస్తానక్షత్రము నాడు వ్రతముచేసి కథ మొదలైనవి, సోమవారమునందు వాయనదానము, సమారాధన చేయవలెను. ఈవ్రతమును చేసినవారు సర్వాభీష్టములను పొందుదురు.

శ్లో॥ ధనధాన్యాకులాం లక్ష్మీం పుత్రపౌత్రవతీమపి । అవాప్య శక్రసంకాశో నృపాన్నారీనరాధికాన్ ॥ దాసభూతా న్కరోత్యేవ ప్రాజ్ఞైరపి ధనైరపి । దీర్ఘమాయుమ్యమారో గ్యం వాక్సిద్ధిం విపులామపి ॥ అవాప్య మహతీమృద్ధిం భుక్త్వా భోగాన్మనోఽమాన్। అంతే శ్రీతారకం బ్రహ్మ లబ్ధ్వా ముక్తో భవేన్నరః ॥

తా॥ ఈవ్రతమును చేయువారు ధనధాన్యసమృద్ధినిన్నీ పుత్రపౌత్రసమృద్ధినిన్నీ సర్వజనుల వశ్యమునున్నూ పొంద గలరు. విశేషఆయురారోగ్యములనున్నూ, వాక్సిద్ధినిన్నీపొంది ఇహలోకమునందు సమస్తసౌఖ్యములను పొంది పరలోకము నందు తారకబ్రహ్మమును పొందగలరు.

శ్లో॥ అష్టాక్షరేణ కృత్వాపి పూజనం హనుమత్ప్రభోః। మంత్రరాజేన వా కుర్యాద్యేనకేనాపి వా మునే ॥

తా॥ ఓమహానింద్రా ఈహనుమద్వ్రతమును అష్టాక్షరీమం త్రముచేతగాని మరియొక హనుమన్మంత్రముచేతగాని చేయ వచ్చును. ఇది ఒక విధము సుమా.

శ్లో॥ పురా పార్థో మహాబాహురర్జునః కృష్ణసారథిః। హస్తాదిత్యవ్రతం కృత్వా వ్రజప్త్వాష్టాక్షరంమనుమ్॥ అతుల్యం బలమాసాద్య విజయం ప్రాప సంతతిమ్ ॥

తా॥ పూర్వమునందు అర్జునుడు హస్తాదిత్యవ్రతమును చేసి అష్టాక్షరమంత్రమును జపించి అధికమైన బలమును పొంది శత్రువులను జయించి కీర్తినిపొందెను.

శ్లో॥ నక్షత్రపంచకే కృత్వావ్రతంహానుమతః వరం। భీమసేనో మహాబాహుర్జితవాన్సకలానరీన్ ॥

తా॥ నక్షత్రపంచకమందు భీమసేనుడు ఈహానుమద్వ్రతమును జేసి సకలశత్రువులను జయించెను.

శ్లో॥ కే వా న పూజయంతీహ ప్రత్యక్షవరదాయకమ్। అర్చయంతి హనూమంతం బ్రహ్మవిష్ణుశివా అపి ॥

తా॥ బ్రహ్మవిష్ణుశివాదులున్నూహనుమంతునిపూజించుచుందురు. ఇటువంటి ప్రత్యక్షవరములను ఇచ్చే హనుమంతుని యెవరు పూజింపకుందురు?

శ్లో॥ హనుమత్సదృశం దైవం నాస్తి నాస్త్యేవ భూతలే। అనేనైవ ప్రమాణేన జయసిద్ధికరం వరమ్ ॥

తా॥ హనుమంతునితో సమానమగుదైవము ముల్లోకములయందు వెతకిచూచినను కానరాదు. ఈప్రమాణముచేత హానుమద్వ్రతము గొప్పదియు జయసిద్ధుల నిచ్చునదియు నగును.

శ్లో॥ తస్మిన్ సంపూజితే భానుర్బ్రహ్మా గౌరీమహేశ్వరః। శ్రీజానకీపతిస్సాక్షాదాదినారాయణః ప్రభుః ॥ ఈశశక్రాది

దిక్పాలాః కుమారో గణనాయకః । బ్రహ్మర్షయో వసిష్ఠా ద్యాస్సనకాద్యాశ్చ యోగినః ॥ పితరో వసవో రుద్రాః పూజితాః స్యుర్న సంశయః । హనూమంతం మహాత్మానం జపకామః ప్రపూజయేత్ । తస్మాత్సర్వప్రయత్నేన శ్రీరామ ప్రియకింకరమ్ ॥

తా॥ ఈ ఆంజనేయమూర్తిని పూజించినయెడలసూర్యుడు బ్రహ్మ గౌరి మహేశ్వరుడు రాముడు దిక్పాలకులు కుమార స్వామి గణపతి వసిష్ఠాదిమహర్షులు సనకాదిసిద్ధయోగులుపితృ దేవతలు అష్టవసువులు ఏకాదశరుద్రులు పూజింపబడినవారై ఇష్టసిద్ధుల నిచ్చుదురు. కావున ఆంజనేయుని ముఖ్యముగా పూజింపవలెను.

శ్లో॥ య ఇదం శృణుయాన్నిత్యం శ్రావయేద్వా సమాహితః । స లబ్ధ్వా సకలాభీష్టాన్ బ్రహ్మలోకే మహీ యతే॥ చంద్రహీనా యథా రాత్రిర్నథహీనో యథా నృపః॥ వృథా ప్రబంధో హనుమన్నామహీన స్తపోధన ॥

రా॥ ఎవరు దీనిని భక్తిశ్రద్ధలతో విందురో వారు ఇహలోకమున సకలాభీష్టములనుపొంది పిదప బ్రహ్మలోకమున ఉందురు. హనుమన్నామములేని ప్రబంధము చంద్రుడులేని రాత్రివలెను నిర్ధనుడగు ప్రభువువలెను వ్యర్థమగుచున్నది. అని మైత్రేయునకు పరాశరుడు చెప్పెనని సూతుడు మహర్షులకు జెప్పెను.

ఇతి హనుమద్వ్రతకథాయాం ఫలశ్రుతిర్నామ పంచమోధ్యాయః

సమాప్తః.



# శ్రీ హనుమద్వ్రతోద్యాపనము

అథ యజమానో మహానద్యాం మాధ్యాహ్నికస్నానం కృత్వా నిత్యకర్మ విధాయాచార్య బ్రహ్మఋత్విగ్భిః సహోప విశ్య ప్రాణానాయమ్య ఏవం గుణేత్యాది శుభతిథౌ ధర్మపత్నీ సమేతస్య మమ హనుమద్వ్రత కల్పోక్త సంపూర్ణఫలావాప్త్యే ధర్మార్థకామమోక్ష చతుర్విధపురుషార్థ సిద్ధ్యర్థం శ్రీ మదాంజనేయప్రీత్యర్థం హనుమద్వ్రతోద్యాపనాఖ్యం కర్మ కరిష్యే॥

అస్మిన్కర్మణి ఆచార్యత్వం భవంతఃకుర్వంత్వితి వేద వేత్తారం కుటుంబినం విత్తహీనం శాంతమాచారవంతం బ్రాహ్మణమాచార్యత్వేనయోజ్య॥ ఏవం లక్షణ సంయుక్త మపరం బ్రాహ్మణం బ్రహ్మత్వేనయోజ్య॥తతః త్రయోదశ కలశానాహనార్థం త్రయోదశబ్రాహ్మణానృత్విగ్విధానియోజ్య। ఏవమావరణం కృత్వాతతో నిష్కమాత్రసువర్ణేన తదర్ధేన యథాశక్త్యా హనుమత్ప్రతిమాం కృత్వాప్రాణానాయమ్య హనుమద్వ్రతోద్యాపనంగత్వేన పంపాపూజాంకృత్వా ॥పునః ప్రాణానాయమ్య॥ శుభతిథౌధర్మపత్నీసమేతస్యమమ మనో వాంఛాఫలసిద్ధ్యర్థం । శ్రీమదాంజనేయ ప్రీత్యర్థమాంజనేయ ప్రతిమాపూజాంకరిష్యే । ఇతిసంకల్ప్య॥ తత్ప్రతిమాశుద్ధ్యర్థం పంచామృత స్నపనం కృత్వా మూలమంత్రేణశుద్ధోదకస్నప నం కృత్వా। పంచప్రస్థ పరిమిత శ్వేత తండులోపరిఅలంకృత్య పూర్ణకలశం సంస్థాప్య తదుపరి వస్త్రంనిధాయతదుపరి ప్రతిమా

మాధాయ ప్రాణప్రతిష్ఠాంకృత్వా తతః త్రయోదశకలశాన్ప్రీతి మావేష్టితాన్ స్తండులేషునిధాయ ! కలశపూజాం కృత్వా తేషు కలశేషు వస్త్రాణ్యావేష్ట్య తేషునానావిధఫలానిదత్వా ! సువర్ణానికృత్వా అంజనేయపూజార్థం కలశపూజాంకృత్వాతతః పీఠార్చనంకుర్యాత్ ॥ పీఠస్యాధః స్తలాధః । తలాయనమః । వితలాయనమః । సుతలాయనమః । రసాతలాయనమః । తలాతలాయనమః । మహాతలాయనమః । పాతాళాయనమః ॥ తత్రాగాధసర్వతోముఖసుధాబ్ధిభ్యానమః । తత్రకస్మైచిత్కమఠాయనమః । తదుపరి సహస్రఫణీఫణామండితమణి ప్రకాశితా శేషలోక శేషాయనమః । అష్టదిగ్గజేభ్యోనమః ॥ తదుపరిభూమండలాయనమః, దిక్పాలకేభ్యోనమః । తన్మధ్యే మేరవేనమః । మేరోర్దక్షిణదిగ్భాగే కస్మైచిద్రత్నసానవేనమః । తన్మధ్యే సురతరవేనమః । తన్మూలేసువర్ణవేదికాయైనమః । వేద్యాం వృక్షస్యపూర్వభాగే నవరత్నఖచితనూతనపీఠాయనమః । ఏవంభావయిత్వా ॥

స్వామిన్సర్వజగన్నాథయావత్పూజావసానకం తావత్త్వం ప్రీతిభావేనప్రతిమాయాం స్థిరోభవ తత్ర త్రయోదశగ్రంథియుక్తదోరకం ప్రతిష్ఠాప్య ॥

అథధ్యానం ॥

శ్లో॥ వందే విద్యుద్వలయలసితం బ్రహ్మసూత్రం దధానం
కర్ణద్వంద్వే కనకవలయేకుండలే ధారయంతం
సత్కౌపీనం కటుపరివృతం కామరూపం కపీంద్రం
నిత్యంధ్యాయేదనిలతనయం వజ్రదేహం వరిష్ఠం ॥ ౧

శ్లో॥ ప్రతప్తజాంబూనదదివ్యభాసం దేదీప్యమానాగ్ని విభాసు
రాక్షం ప్రఫుల్లపంకేరుహ శోభనాస్యం ధ్యాయే హృదిస్థం
పవమానసూనుం॥ ౨

అథకల్పోక్తప్రకారేణ ఆవాహనాది షోడశోపచారా
న్కృత్వా-

శ్లో॥ నమః సర్వహితార్థాయ జగదారాధ్యకర్మణే
అమేయాయాంజనేయాయ పునరర్ఘ్యంపురోర్పయేత్. 3

ఇతి ప్రసన్నార్ఘ్యం॥

శ్లో॥ భక్త్యా ప్రకల్పితైరేతైరుపచారైశ్చషోడశైః
భగవన్హనుమానీశ ప్రీయతాం మే ప్రియోక్తిభిః. ౪

ఉపచార సమర్పణం॥

శ్లో॥ యస్యస్మృత్యాచనామోక్త్యా తపః పూజాక్రియాదిషు
న్యూనం సంపూర్ణతాం యాతి సద్యో వందే తమచ్యుతం

శ్లో॥ మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం కపీశ్వర
యత్పూజితం మయాదేవ పరిపూర్ణం తదస్తుతే॥ ౫

ఏవం రాత్రౌ ప్రథమయామపూజాం కృత్వా॥

తస్యాం రాత్ర్యాం ప్రతియామపూజాం కుర్వన్గీతవాదిత్రాదిమంగళధ్వనిభిర్భాగవతపఠనాదిపురాణశ్రవణాదిభిర్జాగరణం కృత్వా, పరేద్యుః ప్రభాతే మహానద్యాం బ్రాహ్మణైః సహ స్నానంకృత్వా। నిత్యకర్మవిధాయ। గంధాదిభిరలం కృత్య గృహమాగత్య పూర్వవత్పూజాంకృత్వా। హనుమద్వ్రతోద్యాపనాంగహోమంకుర్యాత్॥ క్షీరాన్నేన ఆజ్యేనపిప్పల సమి

ద్భిఃశకల్యోప్తక్తద్రవ్యేణమూలమంత్రేణాష్టోత్తర సహస్రమష్టోత్తర
శతంవా హోమంకుర్యాత్। పూర్ణాహుతించదత్వా బ్రాహ్మణే
దక్షిణాందత్వా। తత ఆచార్యం పూజయిత్వా। ప్రతిమాం
సవస్త్రాం సాలంకారాం సతండులాంచదత్వా తద్దానసాద్గు
ణ్యార్థం దక్షిణాందత్వా॥ ఆచార్యాయసవత్సాం సాలంకారాం
పయస్వినీంగాం దద్యాత్॥ తతఋత్విగ్భ్యః సవస్త్రాన్కలశా
న్దత్వా। దక్షిణాం దత్వాపిశిష్యవంగుదీనాంధ కృపణజనా
న్బ్రాహ్మణాన్సంతర్ప్య। ఋత్విగాదిబ్రాహ్మణాన్ఛతం పంచా
శత్పంచవింశత్త్రయోదశవా బ్రాహ్మణాన్మిష్టాన్నభోజనేన
సంతర్ప్య। భూరిదానం। విభవానుసారేణకుర్యాత్॥ ఏవం
కుర్వన్యజమానః కృతార్థో భవతి॥ హనుమాన్సంప్రీతో వరదో
భూత్వా। పుత్రపౌత్రాది సర్వకామాన్ప్రయచ్ఛతి॥

ఇతి శౌనకాదికంప్రతిసూతః ప్రోవాచ

ఇతి హనుమద్వ్రతోద్యాపన పూజాప్రయోగవిధిః॥

ద్వితీయ భాగము సంపూర్ణము.

ఓమ్

# శ్రీ హనుమజ్జయంతీ విధానం

ఆచమ్య । దేశకాలౌ సంకీర్త్య । శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం, శ్రీసువర్చలాసహితాంజనేయస్వామి దేవతాముద్దిశ్య । శ్రీసువర్చలాసహితాంజనేయస్వామి ప్రీత్యర్థం । రాజ రాష్ట్ర గ్రామ యజమానాచార్యా, ద్యర్చక । పరిచారకాభి వృద్ధ్యర్థం । అస్మిన్ గ్రామేస్థితానాం ప్రజానాం బ్రాహ్మణాది చాతుర్వర్ణ్యానాం సర్వేషాం భక్త జనానాం, వ్యాధిచోర దుర్భిక్షానావృష్టి రాజ్యబాధాది సర్వోపద్రవ శాన్త్యర్థం । ఏతద్గ్రామాభి వృద్ధ్యర్థం । మారీ స్ఫోటకాది సర్వబాధా నివారణార్థం । స్వస్త్యర్థం । సమస్తమంగళా వాప్త్యర్థం । ఉత్సవ కర్తుః...గోత్రస్య...నామధేయస్య, ధర్మపత్నీ సమేతస్య, క్షేమస్థైర్య విజయాభయాయురారోగ్యైశ్వర్యాభి వృద్ధ్యర్థం ధర్మార్థ కామమోక్ష చతుర్విధ ఫలపురుషార్థ సిద్ధ్యర్థం. శ్రీహనుమత్ప్రసాదేన నిరన్తర నిరతిశయ తత్పాద సేవాప్రాప్త్యర్థం । శ్రీమదాంజనేయస్య । సాలోక్య, సారూప్య, సామీప్య, సాయుజ్యా వాప్త్యర్థం అస్య దేవ దేవస్య । శ్రీసువర్చలా సహితాంజనేయ స్వామినః ప్రత్యబ్ద క్రియ మాణ శ్రీహనుమజ్జయంతీ ప్రయుక్త పాంచాహ్నిక మహోత్సవే అస్మిన్ దివసే కల్యాణోత్సవాఖ్యం కర్మకరిష్య మాణః । తదంగత్వేన । తదాదౌ శుద్ధ్యర్థం వృద్ధ్యర్థం శాంత్యర్థ మభ్యుదయార్థంచ మహాజనైస్సహ స్వస్తి పుణ్యాహ వాచనం కరిష్యే । ఆదౌ నిర్విఘ్న ప్రారంభ పరిసమాప్త్యర్థం

శ్రీమహాగణపతి పూజాంచకరిష్యే । ఆదౌ గణపతి పూజాం కృత్వా । పుణ్యాహం వాచయిత్వా । అనంతరం ఋత్విగ్వరణం కుర్యాత్ । శ్రీసువర్చలాసహిత హనుమజ్జయంతీ ప్రయుక్త పాంచాహ్నిక మహోత్సవే కర్మణి ఆచార్యం త్వా మహాం వృణే । బ్రహ్మాణం త్వా మహాం వృణే । అర్చకం త్వా మహాం వృణే । పరిచారకం త్వా మహాం వృణే । హనుమద్ద్వాదశాక్షరీ మహామంత్రానుష్ఠానార్థం త్వా మహాం వృణే । మన్యుసూక్త సంపుటితైకాదశ రుద్రాభిషేకార్థం త్వా మహాం వృణే । శ్రీమద్రామాయణాంతర్గత సుందర కాండ పారాయణార్థం త్వా మహాం వృణే । ఇత్యాది ఋత్విగ్వరణం కుర్యాత్ । అనంతరం అఖండదీప స్థాపనం కరిష్యే । అఖండ దీపస్థాపనానంతరం వాస్తుపూజా । వాస్తుహోమంచకుర్యాత్ । వాస్తుహోమానంతరం అంకురారోపణం కుర్యాత్ । వాస్తుహోమాంతే తమగ్నిం విసృజ్య । అథాతోంకురేత్యాది సర్వం నిర్వర్త్య । తదంగ నాందీ దేవతాహ్వానం । తత్ర నాందీ దేవతేత్యాది ఇడా వాచనాంతం కృత్వా । - ఉత్సవాదౌస్నపనం. ఉత్సవాదౌ దేవాలయం ప్రవిశ్య । దేవం ప్రణమ్య । ఉత్సవ విగ్రహాస్య। మూల మూర్తేః పంచామృత స్నపనం కరిష్యే । క్షీర, దధ్యాజ్య, మధు, శర్కరోదక, పూరితాన్ । పంచప్రధాన కలశాన్ । పంచకలశాన్ యవధాన్యషుతండులేషువా అవక్రేణ పంక్తిన్ దక్షిణాద్యుత్తరాంతాన్ కృత్వా

వస్త్రే తైంతై కేన కలశాన్ సంవేష్ట్య కలశేషు అక్షత పల్లవ కుశకూర్చాదీన్నిక్షిప్య! క్షీరే అథర్వణ వేద మావాహ యామి। తత్కలశోపరి అశ్వినా ఆవాహయామి। దధ్ని ఆదిత్యమావాహయామి। ఉపరిస్థానే అప్సరస ఆవాహయామి। ఘృతే సామవేద మావాహయామి। తత్కలశే వత్సరా నావాహయామి। మధుని యజుర్వేద మావాహయామి। తత్కలశే వాయు మావాహయామి।గుడోదకే కశ్యప మావాహ యామి। తత్కలశే మరుత ఆవాహయామి। దశకలశాధి దేవతాభ్యోనమః ప్రాణప్రతిష్ఠాది షోడశోపచారాన్ సమర్ప యామి। ఆప్యాయస్వేతి మంత్రేణ క్షీరేణ స్నపయామి। ఆపోహిష్ఠామ యో భువేతి మంత్రేణ శుద్ధోదకేన స్నప యామి। దధిక్రావిణ్ణేతి మంత్రేణ దధ్నాస్నపయామి। ఆపో హిష్ఠేతి మంత్రేణ శుద్ధోదకేన స్నపయామి। మధువాతేతి మంత్రేణ మధునా స్నపయామి। ఆపోహిష్ఠేతి మంత్రేణ శుద్ధోదకేన స్నపయామి। శుక్రమసీతి మంత్రేణ ఆజ్యేన స్నపయామి। ఆపోహిష్ఠేతి మంత్రేణ శుద్ధోదకేన స్నపయామి। తాశ్శర్కరేతి మంత్రేణ శర్కరయా స్నపయామి। ఆపోహిష్ఠేతి మంత్రేణ శుద్ధోదకేన స్నపయామి। యాఃఫలినీర్యేతి మంత్రేణ ఫలోదకేన స్నపయామి ఆపోహిష్ఠేతి మంత్రేణ శుద్ధోదకేన స్నపయామి। మిత్రస్సుపర్ణ ఇతిశ్లోకేన విమృజ్య। మిత్ర స్సువర్ణశ్చంద్ర ఇంద్రోథ రుద్రస్త్వష్టా విష్ణు స్సవితా గోపతి స్త్వం। త్వం విష్ణు భూర్తాని త్రాతాస్థు దైత్య స్త్వయా వృతం జగదుశ్చేపగృహ్య। విష్ణోర్నుకమితి వస్త్రాభరణం।

శన్నోదేవీరిత్యాచమనం । తద్విష్ణోః పరమ మితి పుష్పం । తద్విప్రాస ఇతి గంధం । పరోమాత్రయేతి ధూపం । పరో మాత్ర యాతను వావృధాన । నతేమహిత్వ మన్వశ్నువన్తి। ఉభే తే విద్మ రజసీ పృథివ్యా విష్ణోదేవత్వం । పరమస్యవిత్సే। శ్రీమదాంజనేయస్వామినే నమః ధూపం సమర్పయామి । విష్ణోః కర్మాణీతి దీపం । విష్ణోః కర్మాణి పశ్యత యతో వ్రతాని పస్పశే । ఇంద్రస్యయుజ్యస్సఖా । దీపం సమర్పయామి । త్రిర్దేవ ఇత్యర్ఘ్యం । త్రిర్దేవః పృథివీ మేషఏతాన్ । విచక్రమే శతర్చసంమహిత్వా । ప్రవిష్ణు రస్తు తవస స్తవీ యాన్ । త్వేషగ్ంహ్యస్యస్థ విరస్యనామ । అర్ఘ్యం సమర్ప యామి । శన్నోదేవీ రిత్యాచమనం । శన్నోదేవీ = వంతునః ఆచమనీయం సమర్పయామి॥

పట్వాత్రప్రయోగేన అగ్నిప్రతిష్ఠాపనం కరిష్యే । (ఆజ్యేనజుహుయాత్ ఏవం = శిక్షా । శ్రీసువర్చలా సహిత ఆంజనేయస్వామినః ప్రత్యబ్దం క్రియమాణ శ్రీహనుమజ్జయంతీ ప్రయుక్తపాంచాహ్నిక మహోత్సవే ప్రథమదినే సాయంకాలే అగ్నిప్రతిష్ఠాపనం కరిష్యే । స్థండిలోల్లేఖనాద్యాజ్య సగ్ంస్కారాంతంచ తుష్పాత్ర ప్రయోగం కుర్యాత్ । పూర్వ పరిషేచనం కుర్యాత్ । సాయంకాలే సాయమౌపాసనం హోష్యే । ప్రాతఃకాలే ప్రాతరౌపాసనం కరిష్యే । ఇతి సంకల్ప్య । చత్వారి శృంగా ఇతిధ్యాత్వా । అగ్నిమలం కృత్య । శ్రీమదాంజనేయ మావాహయామి । వాయుపుత్ర

మావాహయామి । అంజనీసుత మావాహయామి । కేసరి ప్రియ మావాహయామి । - అర్ఘ్యం పరిషిచ్య ఓం హ్రీం హరిమర్కట మర్కటాయ స్వాహా । ఆంజనేయా యేదం॥

ఆం అంజనాసుతాయనమః హృదయ దేవాయస్వాహా ।
అంజనాసుతాయ హృదయదేవాయే దంనమమ ।
ఈం రుద్ర మూర్తయేనమః శిరో దేవాయ స్వాహా ।
రుద్రమూర్తయే శిరో దేవాయేదం నమమ ।
ఊం వాయుసూనవే నమః శిఖా దేవాయ స్వాహా ।
వాయుసూనవే శిఖా దేవాయేదం నమమ ।
ఐం అగ్ని గర్భాయనమః కవచదేవాయ స్వాహా ।
అగ్ని గర్భాయ కవచదేవాయేదం నమమ ।

ఔం శ్రీరామ ముఖ్యదూతాయనమః నేత్రత్రయ దేవాయస్వాహా । శ్రీరామ ముఖ్యదూతాయ నేత్రత్రయ దేవాయేదం నమమ ।

అః బ్రహ్మాస్త్ర నివారణాయనమః అస్త్రదేవాయ స్వాహా । బ్రహ్మాస్త్ర నివారణాయ అస్త్రదేవాయేదం నమమ।

జాం జాం బవతే స్వాహా జాంబవత ఇదం । విం వినతాయస్వాహా । వినతాయేదం । నీం నీలాయస్వాహా । నీలాయేదం పం పనసాయస్వాహా । పనసాయేదం । గం గంధ మాదనాయస్వాహా । గంధమాదనాయేదం । సుం సుషేనాయ స్వాహా । సుషేణాయేదం। మైం మైందాయస్వాహా । మైందా యేదం । ద్విం ద్వివిదాయస్వాహా । ద్వివిదాయేదం ।

లం ఇంద్రాయస్వాహా । రం అగ్నయే స్వాహా । హాం యమాయ స్వాహా ॥ షం నిర్ఋతయేస్వాహా । వం వరుణాయస్వాహా । యం వాయవే స్వాహా । సం కుబేరాయ స్వాహా । శం ఈశానాయస్వాహా । వం వజ్రాయస్వాహా । శం శక్తయేస్వాహా । దం దండాయస్వాహా । ఖం ఖడ్గాయ స్వాహా । పం పాశాయస్వాహా । ధ్వం ధ్వజాయస్వాహా । గం గదాయస్వాహా। త్రిం త్రిశూలాయస్వాహా । భూస్స్వాహా। భువస్స్వాహా। సువస్స్వాహా । భూర్భువస్సువస్స్వాహా ప్రజాపతయ ఇదం నమమ. ఉత్తర పరిషేచనం కుర్యాత్ । స్వస్తి శ్రద్ధామితి నమస్కారాంతం—

శ్రీ సువర్చలాంజనేయ కల్యాణోత్సవ విధిః॥

జ్యేష్ఠశుద్ధ దశమ్యాం కల్యాణోత్సవః కార్యః ।

అథ కర్తా ప్రక్షాళిత పాణిపాదః కల్యాణమంటపం ప్రవిశ్య । నమస్సదస ఇతి పరిషదముపస్థాయ। నమస్సదసే= = నమః పృథివ్యై । ఏతత్కల్యాణ మంటపాంతస్థిత విద్వన్మహాజనాః శ్రీసువర్చలాంజనేయ కల్యాణోత్సవం కర్తుం మమ యోగ్యతా సిద్ధిరస్త్వితి భవంతో బ్రువంతు ఇతిప్రార్థ్య । యోగ్యతా సిద్ధిరస్త్వితి తైరనుగృహీతః । తేభ్యో దక్షిణా తాంబూలాని దత్వా । సపత్నీక ఉపవిశ్య । ఆచమ్య । ప్రాణానాయమ్య । శ్రీసువర్చలాసహితాంజనేయస్వామి కల్యాణోత్సవంకరిష్యే। ఆదౌగణపతిపూజాం పుణ్యాహంచ వాచయిత్వా । ఋత్విగ్వరణం కుర్యాత్ ॥ ఆచార్యం త్వా మహాం వృణే ॥

బ్రహ్మాణంత్వామహాంవృణే । ఆచార్యకంత్వామహాంవృణే ॥ పరిచారకం త్వామహాంవృణే । హనుమద్ద్వాదశాక్షరీమంత్రానుష్ఠానార్థంత్వామహాం వృణే । (ఇత్యాదిఋత్విగ్వరణం) తతః॥ మహీంద్యౌరితిమంటపాంతర్భూమిం స్పృష్ట్వా । మహీద్యౌః పృథివీచన ఇమం యజ్ఞం మిమిక్షతామ్। పిపృతాన్నోభరీమభిః । అభివస్త్రాసువసనేతి వస్త్రమభిమంత్ర్య । అభివస్త్రాదేవసోమ । ఓషధయఇతితండులాన్యభిమంత్ర్య ఔషధయః॥ అనాతురమ్ । తండులోపరి శ్రీసువర్చలాంజనేయ విగ్రహాంచ మంగళవాద్యపురస్సరం మహారాజోపచారైస్సహాయుంజానః ప్రథమం మనఇతి వివాహాగారం ప్రవేశ్య । అష్టదళపద్మమధ్యే సంస్థాప్య । యుంజానః ప్రథమం మన స్తత్వాయసవితాధియః । అగ్నింజ్యోతిర్నిచాయ్య పృథివ్యా అధ్యాభరత్ । యుక్త్వాయమనసాదేవాన్ సువర్యతోధియాదివమ్ । బృహజ్జ్యోతిః కరిష్యతస్సవితా ప్రసువాతితాన్ । యుక్తేనమనసావయం దేవస్య సవితుస్సవే । సువర్గేయాయశక్త్యై । దేవస్య అర్ఘ్య పాద్యాచమనీయానిదత్వా ॥

అస్య శ్రీమదాంజనేయస్యదేవస్య చతుర్దశ భువనాధీశ్వరస్య । శ్రీమదఖిలాండకోటిబ్రహ్మాండనాయకస్య జగత్కుటుంబినః సకలలోక జనన్యాః సువర్చలాయాశ్చపాణిగ్రహణాధికారసిద్ధ్యర్థంజగద్రక్షణార్థంఅద్యకౌతుకధారణాఖ్యం కర్మ కరిష్యే । సువర్ణ కౌతుకం సుగంధేనానులిప్య । అస్య మణ మితి మంత్రేణాభి మంత్ర్య । అస్యమణం బృహస్పతి

మింద్రా నాయచోదయ । వా చం విష్ణుగ్ం సరస్వతీగ్ం సవితారంచ వాజినమ్ । సోమగ్ం రాజానం వరుణమగ్నిమ న్వారభామహే । ఆదిత్యాన్ విష్ణుగ్ం సూర్యంబ్రహ్మాణంచ బృహస్పతిమ్ । విష్ణోరరాట మసీత్యష్టవార మభిమంత్ర్య । విష్ణోరరాట మపి = విష్ణవేత్వా । కౌతుకదేవతాభ్యోనమః ధ్యానావాహనాది షోడశోపచార పూజాం సమర్పయామి । జితంత ఇతిదేవస్య దక్షిణకరే కంకణం బధ్వా । జితంతే దక్షిణతో వృషభ ఏధిహావ్యః । ఇంద్రోజయాతి నపరాజ యాతా అధిరాజో రాజసురాజ యాతి । బృహత్సామేతి దేవ్యావామకరే కంకణం బధ్వా । బృహత్సామక్షత్ర భృ = రక్ష = రక్షాబంధనముహూర్తో అస్తు । ఆచమ్య । శుభ తిథౌ । అస్య భగవతో దేవ దేవస్య చతుర్దశ భువనాధీశ్వ రస్య శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండనాయకస్య। జగత్కుటుం బినః శ్రీమదాంజనేయస్య అనంతరాత్రిమ సౌగ్యతా సిద్ధ్యర్థం యజ్ఞోపవీతధారణం కరిష్యే । యజ్ఞోపవీతం కస్తూరీ కుంకు మాభ్యా మనులిప్య । గంధ ద్వారా మిత్యభిమంత్ర్య । షోడశోపచారై స్సంపూజ్య । దేవస్యా చ మనం సమర్ప్య । విష్ణో రరాట మసీతి యజ్ఞోపవీతం పరమం పవిత్ర మితిచ మంత్ర ద్వయేన యజ్ఞోపవీతధారణం కుర్యాత్। పునరాచమ నీయం దత్వా । (కన్యావరణము) శ్రీమదాంజనేయార్థం కన్యాం వృణీధ్వమి చతురోవరాన్ బ్రాహ్మణాన్। వైష్ణవాన్ ప్రేమయిష్యన్ । దక్షిణా తాంబూలాని దత్వా । తాన్ విష్ణో

ర్శుక మితిమంత్రేణాభి మంత్ర్య॥విష్ణోర్నుకం వీర్యాణిప్రవోచం యః పార్థివాని విమమేరజాగ్ంసియో అస్కభాయదుత్తరగ్ం సధస్థం విచక్రమాణ స్త్రేధోరుగాయః । తే బ్రాహ్మణాః కన్యా వరణార్థం కన్యాదాతారం శ్రీసూర్యనారాయణస్వామి నంగత్వాబ్రూయాత్ । చతుస్సాగరపర్యంతంగో... భవతు యజుర్వేదశాఖాధ్యాయినః వాసిష్ఠమైత్రావరుణ కౌండిన్య త్రయార్షేయ।ప్రవరాన్విత కౌండిన్యసగోత్రోద్భవస్య ఆంగీరస శర్మణోన ప్త్రే । చతుస్సాగరపర్యంతంగోబ్రాహ్మణేభ్య శ్శుభంభవతు యజుర్వేద శాఖాధ్యాయినః వాసిష్ఠమైత్రా వరుణ కౌండిన్యత్రయార్షేయ ప్రవరాన్విత కౌండిన్య గోత్రోద్భవస్య మరీచిశర్మణః పౌత్రాయ । చతుస్సాగర పర్యంతం గోబ్రాహ్మణేభ్యశ్శుభంభవతు । యజుర్వేద శాఖాధ్యాయినే ॥ వాసిష్ఠ = కౌండిన్యసగోత్రోద్భవస్య వాయుదేవశర్మణః పుత్రాయ । చతుస్సాగర పర్యంతం గోబ్రాహ్మణేభ్య = భవతు యజుర్వేదశాఖాధ్యాయినే । వాసిష్ఠ = కౌండిన్యస గోత్రోద్భవాయ శ్రీ ఆంజనేయ శర్మణే శ్రీమహా శివస్వరూపాయ వరాయ ।

చతుస్సాగర పర్యంతం గోబ్రాహ్మణేభ్య శ్శుభం భవతు యజుర్వేద శాఖాధ్యాయినః కాశ్యప ఆవత్సారనై ధృవత్రయార్షేయ ప్రవరాన్విత కాశ్యప సగోత్రోద్భవస్య బ్రహ్మణోన ప్త్రీం । చతుస్సాగర పర్యంతం గోబ్రాహ్మణేభ్య శ్శుభం భవతు । యజుర్వేద శాఖాధ్యాయినః కాశ్యప

ఆవత్సార, నైధ్రువత్రయార్షేయ ప్రవరాన్విత కాశ్యప
సగోత్రోద్భవస్య కశ్యపప్రజాపతేః పౌత్రీం। చతుస్సాగర
పర్యంతం = శ్రీ సూర్యనారాయణస్య పుత్రీం। చతుస్సాగర
పర్యతం గోబ్రాహ్మణేభ్య శ్శుభం భవతు. యజుర్వేద
శాఖాధ్యాయినీం కాశ్యప, ఆవత్సార। నైధ్రువత్రయా
ర్షేయ ప్రవరాన్విత కాశ్యపస గోత్రోద్భవాం శ్రీసువర్చలా
నామ్నీం సాక్షాత్పార్వతీ స్వరూపిణీం కన్యాం వృణీమహే।
వృణీధ్వం తస్మై దాస్యామీతి। త్రివారంవదేత్। తతః
సామ్రాజ్యం యశస్కర మితి ఆశీర్వాదం కుర్యాత్। తతః
ఉదగగ్రం ఆంజనేయస్య ఆసనార్థం కూర్చాం దద్యాత్।
అహం వర్ష్మనే సజాతానాం విద్యుతామివ సూర్యః। ఇదం
తమధి తిష్ఠామి యోమాగస్త్వాభిదాసతి। ఇత్యుదగగ్రే
విష్టర ఉపవిశేత్। తతః ప్రతద్విష్ణుఃఇతి పాదప్రక్షాళనం
కృత్వా। ప్రతద్విష్ణుస్తవతే వీర్యాయ మృగోనభీమః కుచరో
గిరిష్ఠాః। యస్యోరుషుత్రిషు విక్రమణేష్వధి క్షియంతి భువ
నాని విశ్వా। 'న' య శ్చక్రాయ విద్మహే సహస్ర
జ్వాలాయ ధీమహి తన్నః శ్చక్రః ప్రచోదయాత్। ఇమంమే
గంగ ఇత్యనువాక శేషేణ పుష్పోదక స్నపనం కృత్వా।
ఇమంమే గంగే యమునే...సుషోమయా। అర్చత ప్రార్చ తేతి
దేవమలంకృత్య। అర్చత ప్రార్చత ప్రియమేధాసో అర్చత।
అర్చంతు పుత్రకా ఉతపుర్న ధృష్ణ్వర్చత। హిరణ్య
రూపస్సహిరణ్య...హిరణ్యా దాదదత్య న్నమస్మై। సకలా
రాధనైః స్వర్చితమస్తు। అథమధుపర్కం। దధిమధు సం

మిశ్రం స్వర్ణపాత్రేనిధాయ । పవిత్రద్వయం నిక్షిప్య । మధు పాత్రేత్యు దానేక్ష్య మధువా తా ఋతాయతే - మాధ్వీర్నా వోభవంతునః । అయంతే మధుపర్కో మధుపర్కో మధు పర్కః । అమృతోపస్తరణ మసీత్యపః పీత్వా । అమృతోపస్త యన్మధున ఇతి మధుపర్కం సకృత్ప్రాశ్య । యన్మధునో రణమసి । మధవ్యం పరమమన్నాద్యం వీర్యం । తేనాహం మధునోమధవ్యేన పరమేణాన్నాద్యేన వీర్యేణ పరమోన్నాదో మధవ్యోసాని । సకృన్మంత్రేణ । ద్విస్తూష్ణీం । అమృతాపి ధానమసీ త్యపపీత్వా అమృతాపి ధానమసి । హస్తప్రక్షాళనం కృత్వా । తతః యువం వస్త్రా ణీతి వస్త్రం దద్యాత్ । యువం వస్త్రాణి పీవసా ...సచేథే । తతః చరణం పవిత్రమితిగాం విసృజేత్ । చరణం పవిత్రం... లోకే సుధితాం దధాతు । సిద్ధమన్నం భూతమిత్యుక్తే । భూతం సావిరాట్ । తన్మాక్షాయి! తస్యతేక్షీయ । తన్మ ఊర్జంధాః । ఓం కల్పయత । అన్నం ప్రాణమన్న మపాన మాహుః । అన్నం మృత్యుంతము జీవాతు మాహుః । అన్నం బ్రహ్మణోజరసంవద న్తి । అన్నమాహుః ప్రజననం ప్రజానాం । తతోదైవజ్ఞో ఘటికాజల మంత్రేణ ముహూర్తం సమ్యగవలోక్య । నక్షత్ర మార్గేణవా । యవనికాం నిధాయ। అథానంత వీర్యస్యేతి మహాసంకల్ప పఠనం కృత్వా॥ అథా నంత వీర్యస్య । శ్రీమదాదినారాయణస్య । అచింత్యాపరిమిత శక్త్యాభ్రియమాణస్య । మహాజలౌఘమధ్యే। పరిభ్రమ మాణా నామనేకకోటి బ్రహ్మాండానా మేకతమే అవ్యక్త ప్రకృతి మహ

దహంకారాకాశవాయువహ్ని జల పృథివ్యావరణై స్సప్తభిరా
వృతే స్మిన్ మహతి బ్రహ్మాండ కరండమండలే । ఆధారశక్తి
శ్రీవరాహ కూర్మానంతాద్యష్ట దిగ్గజోపరి ప్రతిష్ఠితస్య
పాతాళాది సప్తలోకస్యోపరితలే । ప్రతిలోమేన సత్యాది
లోకషట్కస్యాధోభాగే । మహానాళాయమాన ఫణిరాజ
రాజశేషస్య సహస్ర ఫణామండలమండితే । దిగ్దంతి శుండా
దండోత్తంభితే । లోకాలోకాచలవలయితే । లవణేక్షుసురా
సర్పిర్దధిక్షీరోదకార్ణవైః పరివృతే । జంబూప్లక్షకుశ క్రౌంచ
శాక శాల్మలి పుష్కర సప్తద్వీపైరావృతే । ఇంద్రకశేరు
తామ్రగభస్తినాగ సౌమ్య గంధర్వచారణ భారతాఖ్య నవ
ఖండ మండితే । మహాసరోరుహాకారే పంచాశత్కోటి
విస్తీర్ణ భూమండలే । లక్షయోజన విస్తీర్ణ జంబూద్వీపే ।
సుమేరునిషధహేమకూట హిమాచలానాం హరివర్ష కింపురుష
వర్షయోశ్చదక్షిణే । సేతుబంధమలయాచల యోరుత్తరే
సహస్రయోజన విస్తృతే । భరతవర్షే । భరతఖండే । ప్రజా
పతిక్షేత్రే । దండకారణ్యే । కర్మభూమౌ । అయోధ్యాకాశీ
కురుక్షేత్ర గయాప్రయాగ కాంచీ శ్రీరంగ శ్రీవేంకటాచలాది
పుణ్యక్షేత్రైః గోదావరీ కృష్ణా కావేరీ గంగా యమునా
సరయూ నర్మదాది పుణ్యనదీ భిర్విరాజితే । సమ భూమధ్య
రేఖాయాం పూర్వదిగ్భాగే । శ్రీశైలస్య ఈశాన్య ప్రదేశే ।
కృష్ణా గోదావర్యోర్మధ్య దేశే సమస్తదేవతా బ్రాహ్మణస
న్నిధావస్మిన్ కల్యాణమంటపే పరబ్రహ్మణానియుక్తస్య సకల
జగత్స్రష్టుః పరార్థ ద్వయ జీవినః కారణబ్రహ్మణః । పర

పంచాశద్వత్సరే । ప్రథమమాసే । ప్రథమపక్షే । ప్రథమ దివసే । అహ్ని ద్వితీయయామే । తృతీయముహూర్తే । శ్వేత వరాహకల్పే । స్వాయంభువ స్వారోచిషాది మనుషట్సు వ్యతీతేషు సప్తమే వైవస్వత మన్వంతరే । బౌద్ధావతారే । అష్టావింశతితమే । మహాయుగే । కృతాది త్రిషు యుగేషు యాతేషు కలియుగే । ప్రథమపాదే । శాలివాహనశకే । ప్రభవాదిషష్టి సంవత్సరాణాం మధ్యే । వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన అముకసంవత్సరే । అముకఅయనే । అముక ఋతౌ । అముకమాసే । అముకపక్షే । దినేవారే । ఇదానీం అనాద్య విద్యావాసనయా సంసారచక్రేఽస్మిన్ మహతి నానాయోనిషు జనిత్వా కేనాపి భాగ్య విశేషేణ । ఇదానీం మనుష్యజన్మ విశేషం ప్రాప్తవతో మమజన్మ ప్రభృత్యేతత్క్షణ పర్యంతమనోవాక్కాయకర్మభిః జ్ఞానతోఽ జ్ఞానతః కృతానాం మహాపాతకోపపాతకాదీనాం నవవిధానాం పాపానాం సద్యః అపనోదన ద్వారా శ్రీమదాంజనేయ ప్రీత్యర్థం ఇహలోకే మనోభిలషిత కామనాసిద్ధి ద్వారా శ్రీమదాంజనేయ సాయుజ్య ప్రాప్త్యర్థం చ యథాశక్తి సాలంకృత కన్యాదాన మహం కరిష్యే । హిరణ్యగర్భ ఇతిమంత్రేణ కుశకుసుమాక్షత హిరణ్యఫలోదకంగృహీత్వా । హిరణ్యగర్భ స్సమవర్తతాగ్రే భూతస్య జాతః పతిరేకఆసీత్ । సదాధారపృథివీంద్యాముతేమాంకస్మై దేవాయహవిషావిధేమ । కన్యాంకనక సంపన్నాం కనకాభరణోజ్జ్వలాం । దాస్యామివిష్ణవేతుభ్యం బ్రహ్మలోకజిగీ

వయా । కన్యాం సాలంకృతాం సాధ్వీం సుశీలాయ సుధీమతే।
ప్రయతోఽహం ప్రయచ్ఛామి ధర్మకామార్థ సిద్ధయే । సువ
ర్చలా రవిసుతా సహధర్మచరీతవ । ప్రతీచ్ఛ చైనాం భద్రం తే
పాణింగృహ్ణీష్వ పాణినా । పతివ్రతా మహాభాగా ఛాయే వాను
గతా సదా । ప్రయతోఽహం ప్రయచ్ఛామి ధర్మకామార్థ
సిద్ధయే । ఇత్యుచ్చార్య పునః కన్యావరగోత్రనామాన్యుక్త్వా ।
చతుస్సాగర పర్యన్తం గోబ్రాహ్మణేభ్యశ్శుభం భవతు ।
యజుః శాఖాధ్యాయినః కాశ్యప । ఆవత్సార । నైధ్రువ
త్ర్యార్షేయప్రవరాన్విత కాశ్యపస గోత్రోద్భవస్య బ్రాహ్మ
ణోన ప్త్రీం । చతుస్సాగరపర్యన్తం । గోబ్రాహ్మణేభ్య
శ్శుభం భవతు యజుర్వేద శాఖాధ్యాయినః కాశ్యపఆవత్సార
నైధ్రువత్ర్యార్షేయ ప్రవరాన్విత । కశ్యపప్రజాపతేః
పౌత్రీం । చతుస్సాగరపర్యంతం గోబ్రాహ్మణేభ్యశ్శుభం
భవతు యజుర్వేదశాఖాధ్యాయినః కాశ్యపఆవత్సార నైధ్రువ
త్ర్యార్షేయప్రవరాన్విత కాశ్యపసగోత్రోద్భవస్య శ్రీసూర్య
నారాయణస్వామినః పుత్రీం । చతుస్సాగరపర్యంతం గోబ్రా
హ్మణేభ్యశ్శుభం భవతు యజుర్వేద శాఖాధ్యాయినీం
కాశ్యపఆవత్సార నైధ్రువత్ర్యార్షేయ ప్రవరాన్విత కాశ్యపస
గోత్రోద్భవాం శ్రీసువర్చలానామ్నీం సాక్షాత్పార్వతీ స్వరూ
ణీం కన్యాం । చతుస్సాగరపర్యంతం గోబ్రాహ్మణేభ్యశ్శుభం
భవతు యజుర్వేద శాఖాధ్యాయినః వాసిష్ఠమైత్రావరుణ
కౌండిన్యత్ర్యార్షేయ ప్రవరాన్వితకౌండిన్యస గోత్రోద్భవస్య
ఆంగీరసశర్మణోన ప్త్రే। చతుస్సాగరపర్యంతం గోబ్రాహ్మణే

భ్యశ్శుభం భవతు యజుర్వేద శాఖాధ్యాయినః వాసిష్ఠ మైత్రావరుణ కౌండిన్యత్ర్యార్షేయ ప్రవరాన్విత కౌండిన్యస గోత్రోద్భవస్య మరీచిశర్మణః పౌత్రాయ। చతుస్సాగరపర్యంతం గోబ్రాహ్మణే భ్యశ్శుభం భవతు యజుర్వేదశాఖాధ్యాయినః వాసిష్ఠమైత్రావరుణ కౌండిన్యత్ర్యార్షేయ ప్రవరాన్విత కౌండిన్యస గోత్రోద్భవస్య వాయుదేవశర్మణః పుత్రాయ। చతుస్సాగరపర్యంతం గోబ్రాహ్మణే భ్యశ్శుభం భవతు యజుర్వేద శాఖాధ్యాయినః వాసిష్ఠమైత్రావరుణ కౌండిన్యత్రయార్షేయ ప్రవరాన్విత కౌండిన్యస గోత్రోద్భవాయ శ్రీమదాంజనేయశర్మణే శ్రీమహాశివస్వరూపాయవరాయ। తుభ్యంప్రజాసహత్వకర్మభ్యః ప్రతిపాదయామీతి సహిరణ్యాం కన్యాంహస్తముదక పూర్వం వరహస్తే దద్యాత్। వరః దేవస్యత్వేతికన్యాం ప్రతిగృహ్ణీయాత్ దేవస్యత్వాస వితుః... పూష్ణోహస్తాభ్యాం ప్రతిగృహ్ణామి। రాజాత్వావరుణోనయతు దేవిదక్షిణే ప్రజాపతయేకన్యాం। తేనామృతత్వమశ్యాం। వయోదాత్రే। మయస్తుయోమహ్యంప్రతిగ్రహీత్రే। కఇదంకస్మాఅదాత్। కామః కామాయ। కామోదాతా। కామః ప్రతిగ్రహీతా। కామగ్ం సముద్రమావిశ। కామేనత్వాప్రతిగృహ్ణామి। కామైతత్తే। ఏషాతేకామదక్షిణా। ఉత్తానస్త్వాంగీరసః ప్రతిగృహ్ణాతు। ఇతికన్యాం ప్రతిగృహ్ణీయాత్। తతః కన్యాదాననాద్గుణ్యార్థం యథాశక్తి దక్షిణాంతుభ్య మహాంసంప్రదదేనమమ గోదాన, భూదాన, సాల గ్రామదానాది షోడశమహాదానానికుర్యాత్। గవామంగే

షుతిష్ఠంతి భువనాని చతుర్దశ । యస్మాదస్యాః ప్రదానేన హ్యాతశ్శాంతిం ప్రయచ్ఛమే । సర్వసస్యాశ్రయాభూమిర్వ రాహేణసముద్ధృతా । యస్మాదస్యాః ప్రదానేనహ్యాతశ్శాన్తిం ప్రయచ్ఛమే । సాలగ్రామశిలాచక్రీభువనాని చతుర్దశ । యస్మాదస్య ప్రదానేనహ్యాతశ్శాంతిం ప్రయచ్ఛమే । కన్యాదానేన, భూదానేన, సాలగ్రామదానేనచ శ్రీమదాంజనేయః పరమాత్మా సుప్రీతితో వరదో భవతు । తతః లోకాచార క్రమేణ మంగళాష్టకానిపఠిత్వా ।

## లగ్నాష్టకములు

1. శ్రీమద్వాయుసుతో మహామునిగణైః సంసేవ్యమానోవిభుః
పాకారిప్రముఖాభినందిత మహాశ్లోకోపకారః ప్రభుః
జ్ఞానీకల్పతరోస్సముచ్ఛ్రితతతీక్ష్ణకైర్యుతోభీష్టదః
దీవ్యద్ధానప్రచక్షణ శ్శుభకరః కుర్యాత్సదా మంగళమ్.

2. హేమాభోబల విక్రమాదికలిత శ్రీరామకార్యప్రియః
సుగ్రీవాంగద జాంబవన్ముఖయుతో ఘోరాటవీ మధ్యగః
సందారీబహుదేశ మార్గణరతో భూమీసుతాదర్శనే
మైత్రీకార్య విచక్షణశ్శుభకరః కుర్యాత్సదా మంగళమ్.

3. రామాజ్ఞాంశిరసావహన్ జనకజా తాన్వేషణాయోద్యతః
లీలామాత్ర వితీర్ణఘోరజల ధిర్లంకా పురీశోధకః
సౌధాంతర్గ్రృహాదేవ గోపురవనీప్రతా కరాన్వేషణో
జానక్యా నిజదర్శన ప్రియకరః కుర్యాత్సదా మంగళమ్

4. సీతాయాబహుదుఃఖభారహరణః శ్రీరామవాక్యప్రియో
దివ్యం హేమమయాంగులీయక మదాత్తస్యై మణి
ప్రోజ్వలం
తద్ధృత్వాశిరసి ప్రియాయశుభదం సందేశమాభాషితో
భూపుత్రీకరుణావలోకనధనీ కుర్యాత్సదా మంగళం

5. దైత్యారణ్యదవానలోగుణనిధిర్లంకాపురీదాహకో
నిర్విఘ్నం నిజశౌర్యసంస్తుత సురోరత్నాకరోల్లంఘనః
రామం దాశరథిం దయాజలనిధిం స్వాంతేసదాచింతయన్
కార్యాకార్య విచక్షణోవిభురసౌకుర్యాత్సదా మంగళం

6. కార్యాలోచనకోవిదః కపివరః కారుణ్యరత్నాకరో
ధైర్యస్థైర్య మహత్వవానుపనిషద్వ్యాఖ్యామణో భీషణః
రామంయుక్తమనేక వానరభటైశ్శౌర్యేణ సంతోషయన్
దైత్యధ్వంసన పండిత శ్శుభకరః కుర్యాత్సదా మంగళం

7. భూపుత్రీరఘునాయకాంఘ్రి యుగళధ్యానామృతానందితో
వేదాంతాగమశాస్త్రతత్వ విదుషాంవిజ్ఞానచూడామణిః
దీవ్యత్కోటి సహస్రభానుసుమహోదీనాళిసంరక్షక
శ్రీమాన్ సేవకకల్పభూరుహనిభః కుర్యాత్సదా మంగళం

8. భవ్యేశ్రీరఘురామభూమితనయా పట్టాభిషేకోత్సవే
సౌందర్యోజ్వలమంటపే మణిమయేసింహాసనప్రాంగణే
భక్త్యా ఫాలనివిష్ట పాణియుగళః పాదేప్రభోశ్చింతయన్
ఆనందస్తుతి గానతన్మయతనుః కుర్యాత్సదా మంగళం

తదేవలగ్నం సుదినం తదేవ తారాబలం చంద్రబలంతదేవ। విద్యాబలం దైవబలంతదేవ లక్ష్మీపతే తేంఘ్రియుగం స్మరామి।

శ్రీదేవీతనయః శివస్సుఖకరో మిత్రశ్శశీ కంపసః । సర్వే తే మునయశ్చలా దశదిశః స్వర్గాప్సరోగేంద్రాః ఖగాః । నద్యః పుణ్యసరోవరాణిదితిజా స్త్రీర్థాని కంజాసనశ్చేంద్రోపవస్థ్యమరాః సదాజలధయః కుర్వంతువాం మంగళం । సావధానా స్సుముహూర్తాస్సావధానాః ఇత్యన్యాని మంగళాష్టకాని పఠన్ ।

సుముహూర్తేవధూవరయోశ్శిరసి సజీరకగుడంనిక్షిపేత్ ధ్రువం తే రాజా బ్రహ్మణస్పతిః తతః అఘోరచక్షురితి శ్రీమదాంజనేయః సువర్చలాం దృష్ట్వా । అఘోరచక్షురపతిఘ్నియేధిశివాపతిభ్యస్సుమనాస్సువర్చాః । జీవసూర్దేవకామాస్యోనాశంనోభవద్విపదేశం చతుష్పదే। తతస్సువర్చలాంవస్త్రభూషణాదిభిరలంకృత్య । అభివస్త్రాసువసనాదేవసోమ హిరణ్యరూపస్సహిరణ్య నమస్మై సకలారాధనై స్వర్చితమస్తు తతః। మాంగల్యతంతునానేతి మంగళసూత్రం కంఠేబధ్నాతి । మాంగల్యదేవతాభ్యోనమః ధ్యానావాహనాది షోడశోపచార పూజాః కృత్వా మాంగల్యసూత్రం సర్వజనదర్శనానంతరం । మాంగల్యతంతునానేనజగజ్జీవనహేతునా । కంఠేబధ్నామి సుభగేసజీవ శరదశ్శతం । ఇతిమంగళసూత్రంబధ్వా తతః ఏకస్మిన్స్వర్ణాదిపాత్రే ప్రస్థపరిమితం మంగళాచారతండులం నిధాయ । సఘృతేనక్షీరేణ శ్రీసువర్చలాంజనేయయోర్గంజ

లోప్యప స్తీర్య । ద్వి స్తండులానోప్యద్వీరభిఘార్య । బ్రాహ్మ
ణైరైర్వణ్వైస్సహకపిలాన్ స్మారయేత్ । దక్షిణాః పాంతు ।
బహుదేయంచాస్తు । పుణ్యంవర్ధతాంగే శాంతిరస్తు పుష్టిరస్తు
తుష్టిరస్తు వృద్ధిరస్తు । అవిఘ్నమస్తు ఆయుష్యమస్తు ఆరోగ్య
మస్తు సువర్చలాంజనేయస్వామి జన్మనక్షత్రే శతభిషక్
పూర్వాభాద్రానక్షత్రే । శనిచంద్రగ్రహే । వరుణాదిదైవతైః
సహాసోమేనక్రియేతాగ్ం శాంతిరస్తు । ప్రజాపతి స్త్రియాం
యశః ముష్కయోరదధాత్సపం । కామస్యతృప్తిమానందం
తస్యాగ్నేభాజయేహమా । మోదః ప్రమోద ఆనందః ।
ముష్కయోర్నిహితస్సపః । సృత్వేవకామస్యతృప్యాణి । దక్షి
ణానాం ప్రతిగ్రహే । మనసశ్చిత్తమాకూతిం వాచస్సత్యమశీ
మహి । పశూనాగ్ంరూపమన్నస్య యశశ్శ్రీ శ్రీయతాంమయి
యథావామస్యా అతృపగ్ంస్త్రియైపుమాన్ । యథాస్త్రీతృ
ప్యతిపుగ్ంసిప్రియే ప్రియా । ఏవంభగస్యతృప్యాణి । యజ్ఞ
స్యగామ్య । ప్రియః, దదామీత్యగ్నిర్వదతి । త థేతివాయు
రాహతత్ । హంతేతిసత్యం చంద్రమాః । ఆదిత్యస్సత్యమో
మితి । ఆప స్తత్సత్యమాభరన్ । యశోయజ్ఞస్య దక్షిణాన్ ।
ప్రజామేకామస్సమృధ్యతాం । ఇతిసువర్చలాంజనేయోశ్శిరస్య
క్షతారోపణం కృత్వా । ఏవంసఘృతేనక్షీరేణ పత్న్యా
సహాయజమానస్యాం జలోప్యసువ స్తీర్యేత్యాది పశవోమేకామ
స్సమృధ్యతాం యజ్ఞోమేకామస్సమృధ్యతాం । ఇతిద్వితీయం
తృతీయం । మంత్రవత్కృత్వా । తూష్ణీంచతుర్థం । ఏవమక్ష
తారోపణంకృత్వా । యోవైతామితిబ్రహ్మగ్రంధింకుర్యాత్ ।

యోవైతాం బ్రహ్మణో వేదా... ప్రజాంపదుః అనంతరం శ్రీసువర్చలాంజనేయయోః కల్యాణోత్సవ ప్రయుక్తషోడశో పచారపూజాంకృత్వా । అష్టోత్తర సహస్రనామభిశ్చ పూజాంచకృత్వా । మహానీరాజనందద్యాత్ । ఏవంకల్యాణో త్సవంకృత్వా । తత్పీఠకలశవస్త్రసహిత శ్రీసువర్చలాంజనేయ ప్రతిమాం వాచకాయాచార్యాయవాదద్యాత్ । యథాగంధ పుష్పాక్షతైరభ్యర్చ్య । అస్మై బ్రాహ్మణాయ గోత్రాయ నామ్నేసువర్చలాంజనేయ ప్రీతింకామయమానః శ్రీసువర్చ లాంజనేయ ప్రతిమాం, పీఠవస్త్రకలశసహితాం తుభ్యమహం సంప్రదదేనమమ ధరణీగర్భసంభూతే ధరధీధరవల్లభే । ధరణింమేప్రయచ్ఛాశు ప్రీత్యాభవ శుచిస్మితే। అంజనాగర్భ సంభూత భూభారోత్తారణాయచ । ప్రతిమాదానతుష్టస్సన్ వాంఛితంయచ్ఛమారుతే ॥ ఇతిమంత్రద్వయేనదత్వా । అనేన సువర్చలాంజనేయ కల్యాణమహోత్సవేన । అష్టోత్తరసహస్ర నామపూజయాచ ప్రతిమాదానేనచ భగవాన్‌సర్వాత్మకః సుప్రీణాతు ఏతత్ఫలం శ్రీసువర్చలాంజనేయ పరబ్రహ్మార్పణ మస్తు ఆశీర్వాదంకుర్యాత్ ॥ —

## హ ను మ జ్జ యం త్యాం పూ జా ప్ర కా ర ః

వైశాఖ కృష్ణదశమ్యాం హనుమజ్జయంతీ. తస్యాం హనుమాన్పూజనీయః, తత్ర ఆచమ్య ప్రాణానాయమ్య దేశ కాలౌ సంకీర్త్య అస్యాం వైశాఖ కృష్ణదశమ్యాం హనుమ జ్జయంత్యాం సమస్తపాపక్షయార్థంసకలాభీష్టసిద్ధ్యర్థం హనుమ త్పూజాం కరిష్యే. తస్యాంచిద్వేదికాయాం స్వర్ణమయే పీఠే

హనుమన్మూర్తిం ప్రతిష్ఠాప్య ప్రాణప్రతిష్ఠాపనపూర్వకం పూర్వవ్రతకల్పోక్తరీత్యా షోడశోపచారైరభ్యర్చ్య హనుమజ్జన్మవృత్తాంతాయ కల్పంశ్శృణుయాత్. అజ్ఞానాత్ కల్పం యే నశృణ్వంతి తేషాం పూజా సఫలదా. అస్యాం పూజాయాం విశేషః :- దోరపూజా దోరగ్రహణం చ నస్తః. వత్సరనియమోపి నాస్తి. పూజాప్రకారస్తు పూర్వమేవ కథితః. కల్పోపి లిఖ్యతే, సాదరం శృణ్వంతు.

తా॥ వైశాఖ కృష్ణ దశమి హనుమజ్జన్మదినము, ఆరోజున హనుమంతుని పూజచేయవలెను. సంకల్పపూర్వకముగా ఒక వేదికయందు పీఠమును ఉంచి బంగారు వెండి రాగి మొదలైన లోహములతో యథాశక్తిగా హనుమన్మూర్తిని చేయించి పూర్వోక్తపీఠమునందు ఈ విగ్రహమును ఉంచి పూర్వవ్రతమున చెప్పినరీతిగా షోడశోపచార పూజలచేత పూజించి హనుమజ్జన్మకథను వినవలెను. ప్రమాదముచేతగాని అజ్ఞానముచేతగాని ఈకథను యెవరువినరో వారికి వ్రతఫలము లభింపదు. ఈపూజయందు దోరపూజయున్నా దోరమును ధరించు నియమమున్నా లేదు. సంవత్సరనియమమున్నా లేదు. (కనుక కల్పమును వ్రాయుచుంటిని. ఆదరముతో గ్రహింతురు గాక. పరాశరసంహితయందు గలదానిని వ్రాయుచుంటిని.)

శ్లో॥ అన్యద్రహస్యం వక్ష్యామి శృణుష్వ మునిపుంగవ।
వైశాఖే మాసి కృష్ణాయాం జయంత్యాం దశమీతిథౌ ॥
యథాశక్తి సువర్ణేన తామ్రేణ రజతేన వా। హనుమద్వి

గ్రహం ధీమాన్కారయిత్వా ప్రయత్నతః ॥ బ్రాహ్మణాయ సుశీలాయ దానం కుర్యాత్కుటుంబినే ॥

తా॥ ఓ మైత్రేయమహర్షీ మరియొక రహస్యమును చెప్పుచుంటిని వినుము. వైశాఖ కృష్ణదశమియందు హనుమజ్జన్మదినము గనుక ఆరోజున తామ్రముచేతగాని వెండిచేతగాని బంగారముచేతగాని ఆంజనేయవిగ్రహమును చేయించి వేద వేదాంగపారగుడును కుటుంబియునగు యోగ్యుడైన బ్రాహ్మణునకు దానముచేయవలెను.

శ్లో॥ జయంతీదివసే పూజాం కృత్వా హనుమతః ప్రభోః। ఉపవాసో యతేః ప్రోక్తో గృహిణాం భోజనం మతమ్॥

తా॥ జయంతీదివసమున పూజచేయువారు యతులయిన నుపవసింపవలెను. గృహస్థులయిన భోజనమును చేయవచ్చును.

శ్లో॥ పూర్వప్రోష్ఠపదాయుక్తా జయంతీదశమీతిథిః । తత్ర నక్షత్రవైరూప్యే తిథిరేవ ప్రయోజికా॥

తా॥ పూర్వాభాద్రనక్షత్రముతో కూడిన దశమియందు హనుమజ్జయంతి యగును. నక్షత్రము అట్లు కలియక పోయినను తిథియే ప్రధానముగనుక వైశాఖబహుళ దశమియందే జయంతి చేయవలెను.

శ్లో॥ వైశాఖే మాసి యత్నేన కుర్యాద్ధర్మమనుత్తమమ్। అసకృద్వా సకృద్వాపి పరాం గతిమవాప్నుయాత్ ॥

తా॥ వైశాఖమాసమునందు స్నానదాన జపాదికధర్మ మును ఒకరోజుగాని ప్రతిదివసమునందును నియమముకల వారై చేసినయెడల శ్రీహనుమంతుని అనుగ్రహమువలన ఇహలోకమునందు సమస్తసౌఖ్యముల ననుభవించి అంత మందు హనుమత్సాయుజ్యము నొందుదురు.

శ్లో॥ వైశాఖమాసమాహాత్మ్యం కల్పకోటిశతైరపి । న శక్యం వర్ణితుం బ్రహ్మన్బ్రహ్మణాపి సమంతతః॥

తా॥ వైశాఖమాసముయొక్క మాహాత్మ్యమునువర్ణిం చుటకు బ్రహ్మకున్నూ శక్యముకాదు.

శ్లో॥ యత స్స్వర్చలాప్రేయా నంజనాగర్భసంభవః । హనుమాన్మారుతిః శ్రీమానవతీర్ణో మహాబలః॥

తా॥ ఏమనగా : ఈవైశాఖమాసమునందు ప్రపంచ సంరక్షణతత్పరుడైన హనుమంతుడు అంజనాగర్భమునందు ఉద్భవించుటవలన వైశాఖమాసము అంత గొప్పదాయెను.

శ్లో॥ తదాప్రభృతి మాసస్య వైశాఖస్య మహాత్మనః । స్నానదానాది యోగ్యత్వం హనూమజ్జన్మకారణాత్॥

తా॥ ఓమైత్రేయా హనుమజ్జన్మకారణమువలన వైశాఖ మాసమున చేయు స్నానదానాదికమునకు అంత మహత్తర మైన యోగ్యత కలిగెను.

శ్లో॥ ఇతి నిశ్చిత్య మతిమాన్స్నాయాద్బాహ్యజలాం తరే । సంతర్పయేత్పితౄన్ స్త్రతదద్యాద్విప్రాయ వై ధనమ్॥

తా॥ ఈ ప్రకారముగా నిశ్చయించుకొనినవారు బాహ్య జలమునందు వైశాఖస్నానము నాచరించి పితృతర్పణము గావించుకొని యథాశక్తిగా బ్రాహ్మణులకు దానము చేసుకొనవలెను.

శ్లో॥ దాపయేదుదకం చాన్నం హనుమత్ప్రీతయే తథా॥

తా॥ అనంతరము అన్నదానముగాని ఉదకదానముగాని హనుమత్ప్రీతికొరకు చేయవలెను.

శ్లో॥ బ్రాహ్మణః క్షత్రియో వాఽపివైశ్యోవాశూద్ర ఏవ వాస్త్రియః పురుషాంసప్షణ్తో వా యథాశక్తినివేదయేత్। తతస్తు హనుమాన్ప్రీతో దద్యాన్నైజపదాంతికమ్॥

తా॥ బ్రాహ్మణక్షత్రియ వైశ్య శూద్రులున్నా స్త్రీలున్నా పురుషులున్నా నపుంసకులున్నా యథాశక్తిగా ఆంజనేయమూర్తిని పూజించి నివేదనముచేసి ఆమూర్తిని బ్రాహ్మణునకు దానముచేసినయెడల ఆంజనేయమూర్తి సంతోషించినవాడై తనయొక్క పుణ్యలోకమును ఇచ్చును.

## హనుమజ్జన్మకథ

మైత్రేయః॥ శ్లో॥ భగవన్ హనుమజ్జన్మప్రభావో భవతశ్శ్రుతః॥ తస్యోత్పత్తిం స్వరూపం చ శ్రోతుమిచ్ఛామ్యహం ప్రభో॥ హనుమాన్నామ కోవాఽసౌ కస్య పుత్రస్సకీదృశః। కింకర్మా తస్య చోత్పత్తిః కథం బ్రహ్మన్వదస్వ మే॥

తా॥ ఓపరాశరమునీంద్రా హనుమంతునియొక్క ప్రభావము నీవలన వినియుంటిని. ఆయనయొక్క పుట్టుకను స్వరూపమును వినవలెనని కోరుచున్నాను. హనుమంతుడనగా యెవరు? ఎవనియొక్క కుమారుడు? ఎటువంటివాడు? ఏమిచేయుచుండును? సవిస్తరముగా చెప్పుమని అడిగెను.

పరాశరః॥ శ్లో॥ ఇతిహాసంపురావక్ష్యేమైత్రేయ శ్రుణు తత్త్వతః। ఛాయా నామమహాసాధ్వీ తనూజా విశ్వకర్మణః॥ స తాం దదౌ భాస్కరాయ సా న సేహే రవేః ప్రభామ్। మాత్రా పృష్టాఽవదత్కన్యా దుర్గమః పతిసన్నిధిః॥

తా॥ ఓమైత్రేయా పూర్వకథా సందర్భమును చెప్పుచుంటిని వినుము. విశ్వకర్మకు ఛాయ అను కుమార్తె కలదు. ఆకుమార్తెను సూర్యునికిచ్చి వివాహము చేసెను. అటుపిమ్మట ఛాయాదేవి తనభర్తయగు సూర్యునివద్ద నుండుటకు అతనియొక్క తేజస్సును సహింపలేక తల్లి వద్దకువెళ్ళిఅతిదీనయైభర్తృసాన్నిధ్యమున ఉండు యోగ్యత నాకు కలుగకున్నది గనుక ఆవేడిమికి నేను ఓర్వజాలనని పలికెను.

శ్లో॥ మాతఃశ్రమాభూదధునా తస్య తీక్ష్ణకరేణ వై। పుత్రికావచనం శ్రుత్వాసావదత్స్వపతేః ప్రసూః॥ భార్యాయా వచనం శ్రుత్వా విశ్వకర్మాప్రభాకరం। శాణాత్తం స్వల్పప్రభం చక్రే సకరదీధితిమ్॥

తా॥ అట్లుపలికిన కుమార్తెయొక్క వచనములను తల్లి విని ఆవిషయమును తనభర్తయగువిశ్వకర్మకు చెప్పెను. అంత

విశ్వకర్మ భార్యయొక్క వాక్యములను విని సూర్యదేవుని యొక్క వేడిమి తగ్గించుటకు సూర్యబింబమును సానపట్టెను. అప్పుడు సూర్యునియొక్క తేజస్సు తగ్గిపోయెను.

శ్లో॥ భానోశ్ఛిన్నకరచ్ఛాయా కన్యా జాతా సువర్చలా । బ్రహ్మాదయో లోకపాలా స్తత్సౌందర్యాద్విసిస్మిరే॥

తా॥ అట్లు సానపెట్టబడిన తేజస్సమూహము ఒక స్త్రీగా అవతరించెను. ఆలావణ్యాతిశయమునుగాంచి ఆమెకు సువర్చల యను నామము పెట్టిరి. ఆసువర్చలయొక్క రూపమునుచూచి ఇంద్రాదిదేవతలు ఆశ్చర్యముతో—

శ్లో॥ బ్రహ్మాణం పరిపప్రచ్ఛుర్దేవాఇంద్రపురోగమాః । ఏనాం ధృత్వా పతిః కోవా భూయాత్ప్రబ్రహ్మన్వదస్వ నః॥

తా॥ బ్రహ్మనుచూచి ఈ చిన్నదానికి ఎవరు భర్త యగునని పలికిరి.

బ్రహ్మోవాచ॥ శ్లో॥ ఈశ్వరస్య మహాత్తేజో హనూమాన్దివి భాస్కరం । ఫలబుద్ధ్యా తు గృహ్ణీయా త్తస్య భార్యా భవిష్యతి॥

తా॥ ఈశ్వరతేజోరూపుడైన హనుమంతుడు ఫలభ్రాంతిచే సూర్యబింబమును పట్టుకొనును. అట్టి మహాపరాక్రమశాలియగు హనుమంతునకు ఈమె భార్య కాగలదు అని చెప్పెను.

శ్లో॥ రాక్షసైః పీడితా దేవా బ్రహ్మాణం శరణం యయుః। బాధంతే రాక్షసా నిత్యం బ్రహ్మన్లోకానృషీంశ్చ నః॥

తా॥ ఓ మైత్రేయా రాక్షసులు దేవతలనున్ను ఋషిశ్వరులనున్ను లోకములనున్నూ అనేకవిధముల బాధించుచుంత దేవతలందరు ఈ బాధను సహింపజాలక బ్రహ్మను చూచి

శ్లో॥ తేషాం కురు వధోపాయం త్వం హి నః పరమా గతిః। ఇత్యుక్తః ప్రాహ తాన్దేవాన్ మయా న జ్ఞాయతేవధః॥

తా॥ ఓబ్రహ్మదేవుడా ఆదుర్మార్గులను వధించుమార్గమును మాకు చెప్పవలసినది. నీకన్న మాకు వేరు శరణ్యము లేదని చెప్పగా విని ఆ రాక్షసుల నాశనముచేయుట నావలన కాదు.

శ్లో॥ శంకరం పరిపృచ్ఛామో గచ్ఛామో రజతాచలం। తత్ర గత్వా మహాదేవమూచుస్తే సపితామహాః॥ రాక్షసానాం వధోపాయం కురు రుద్ర మహాప్రభో॥

తా॥ మనమందరము రజతాద్రికరిగి ఈశ్వరునకు విన్నవించుకొందము రండని చెప్పి బ్రహ్మదేవుడు వారలదోడ్కొని అచ్చటి కరిగి రాక్షసవధోపాయమును జెప్పుమని శంకరుని ప్రార్థించెను.

శంకర ఉవాచ॥ నరనారాయణం దేవమార్తానాం చ పరాయణం। తిష్ఠంతం పరమక్షేత్రే నిత్యం, బదరికాశ్రమే॥ తంపృచ్ఛామః సురశ్రేష్ఠ గచ్ఛామ స్తత్ర మా చిరమ్॥

తా॥ ఓ బ్రహ్మాది దేవతలారా ఆర్తత్రాణపరాయణుం డగు నరనారాయణుండు బదరికాశ్రమమున కలడు. మనమం దరము కలసి అచ్చటికి వెళ్ళి ఏతద్వృత్తాంతమును విన్నవించు కొందము, రండు, ఆలస్యము చేయకుడని పలికెను.

శ్లో॥ బ్రహ్మేశాదిసురాస్సర్వే నరనారాయణప్రభుం।
నమస్కృత్య జగన్నాథం ప్రపచ్ఛురిదమాదరాత్॥

తా॥ బ్రహ్మాదిసురు లందరున్నూ ఈశ్వరసహితముగా బదరికాశ్రమముజేరి జగన్నాథునకు నమస్కరించి ఇట్లు విన్న వించుకొనిరి.

శ్లో॥ బాధంతే రాక్షసా నిత్యం నరనారాయణప్రభో।
ఏతేషాం తు వధోపాయం శీఘ్రం కర్తుమిహార్హసి॥

తా॥ ఓనరనారాయణమూర్తీ రాక్షసులబాధలుసహింప లేక యుంటిమి. ఆర్తులమగుమమ్ము కటాక్షించి రాక్షస నాశముచేయు ఉపాయమును శీఘ్రముగా చెప్పవలసినది.

శ్లో॥ స ముహూర్తమివ ధ్యాత్వా ప్రోవాచ సకలాన్ సురాన్। భవిష్యతి న సందేహో రాక్షసానాం వధస్సురాః॥

తా॥ అట్లు మొరలిడిన దేవతల వాక్యములను విని నరనారాయణమూర్తి ఒకక్షణకాలము ఆలోచించి, ఓ దేవత లారా తప్పక రాక్షసనాశము కాగలదు. భయము లేదని వారించి,

శ్లో॥ ఇత్యుక్త్వా స్వాత్మన స్తేజస్సమాకృష్య జనార్దనః।
బ్రహ్మాదిభిశ్చ సురాణాం చ తేజసా సాకమీశితుః॥

తా॥ తనయొక్క తేజస్సును, బ్రహ్మమొదలైన దేవతల యొక్కయు ఈశ్వరునియొక్కయు తేజస్సును సంగ్రహించి నటువంటివాడై —

శ్లో॥ పిండీకృత్య దదౌ రుద్రః పపౌ సర్వామరాత్మకమ్।
అథోవాచ హరిర్వ్యక్తి రేతత్తేజోద్భవః సురాః । హరంత్యక్త్వా సురాస్సర్వే గచ్ఛతేతి యథాగతమ్॥

తా॥ ఒకముద్దగా చేసి దానిని ఈశ్వరునిచేతి కిచ్చెను. దానిని ఈశ్వరుడు మ్రింగివేసెను. 'ఈ తేజస్సువలన గొప్ప బలముకలిగిన వానరవ్యక్తి పుట్టును. అప్పుడు మీ కష్టములన్నియు తొలగు'నని వారితో చెప్పి ఈశ్వరుని విడిచి మీ నివాసంబులకు మీ రరుగుడనెను.

శ్లో॥ తతః కాలే మహాదేవః పర్యటన్పృథివీమిమాం ।
పార్వతీసహితశ్శ్రీమాన్వేంకటాఖ్యం గిరిం గతః॥

తా॥ తరువాత కొంతకాలమునకు ఈశ్వరుడు పార్వతీసహితుడై భూమండలమున తిరుగుచు వేంకటాచలపర్వతమునకు చేరెను.

శ్లో॥ నిత్యం సన్నిహితో యత్ర శ్రీనివాసస్సతాం గతిః॥
లభంతే పురుషార్థాన్యస్మిన్పండితపామరాః॥

తా॥ ఆపర్వతమునందు శ్రీనివాసమూర్తి వరములిచ్చి పండితపామరులను రక్షించుచుండెను.

శ్లో॥ తౌ తత్ర దంపతీ చైకే శేషాఖ్యే చిత్రకాననే ।
చేరతుః పరమాహ్లాదే నిర్మలోదసరిద్వరే॥ ఏకదా పరమ

ప్రీతా పార్వతీ పతిదేవతా। క్రీడంతం సురతాసక్తం కపి యుగ్మం దదర్శ హ॥

తా॥ ఆపుణ్యదంపతులిరువురును ఆపర్వతము నందలి సుఖకరములైన ప్రదేశములయందు కొంతకాలము గడిపిరి. ఒకానొక సమయమునందు పార్వతీదేవి క్రీడార్థముగా బయలు దేరిన రెండుకోతులను చూచెను.

శ్లో॥ తతస్సా హ్రీమతీ బాలా మహాదేవశ్య పశ్యతః। పుష్పసాంద్రేషు కుంజేషు తదా రంతుం మనో ధధే।

తా॥ అట్లు బయలుదేరిన వానరమిథునమును చూచి లజ్జగలదియై తానును పొదరిండ్లయందు క్రీడించుటకు ఆసక్తి కలదాయెను.

శ్లో॥ సర్వజ్ఞస్తదభిప్రాయం జ్ఞాత్వా స కపిరూపధృత్। రమయామాస తాం దేవీం కపిరూపధరాం శివామ్॥

తా॥ సర్వజ్ఞుడగు పరమేశ్వరుడు ఆపార్వతీదేవియొక్క అభిప్రాయమును తెలుసుకొనివవా డవ్వుటచేత పార్వతీసహిత ముగా వానరరూపమును ధరించి వానరరూపముతోనున్న యామెను సంభోగాదిక్రియలచే సంతోషపరచెను.

శ్లో॥ సహస్రాబ్దప్రమాణేన క్రీడిత్వా స మహాద్యుతిః। తత్తేజః పార్వతీగర్భే నిధాయ విరరామ హ॥

తా॥ వెయ్యిసంవత్సరములు గడచినపిమ్మట ఆ తేజః పుంజమును పార్వతీగర్భమందు ప్రవేశింపజేసెను.

శ్లో॥ అగ్నౌ చిక్షేపతత్తేజః పార్వతీ ధారణాక్షమా ।
స చాప్యశక్తస్తద్వాయౌ నిక్షిపన్ విససర్జ హ॥

తా॥ కపిరూపముతో నున్న పార్వతి ఆ తేజస్సును భరించుటకు అసమర్థురాలై అగ్నియందు వదలెను. అగ్నిదేవుడున్నూ భరింపజాలక వాయుదేవునకు అప్పగించెను. ఇట్లుండ,

శ్లో॥ తస్మిన్కేసరిణో భార్యా కపిసాధ్వీ వరాంగనా
అంజనా పుత్రమిచ్ఛంతి మహాబలపరాక్రమమ్॥ తపశ్చచార సుమహన్నియతేంద్రియమానసా॥

తా॥ ఇట్లుండగా కేసరియను వానరునియొక్క భార్య అంజనయను పేరు గల వానరస్త్రీ మహాబలపరాక్రమములుకల కుమారుని పొందవలెనని గొప్పదైన తపస్సు చేసెను.

శ్లో॥ తస్యై వాయుః ప్రసన్నాత్మా ప్రత్యహం ఫలమర్పయన్ । భక్షార్థమేకదా తస్యాస్తత్తేజశ్చాప్యధాత్కరే ॥౨౯॥ ఫలబుద్ధ్యాతు తత్తేజస్సాప్యభక్షయదంగనా॥

తా॥ వాయుదేవుడు ఆమెయందు అనుగ్రహముకలిగి ప్రతిదినము నందు భక్షించుటకొరకు ఒక ఫలమునిచ్చుచుండెను. ఒకానొక సమయమందు ఆచిన్నదానియొక్క హస్తమందు ఫలమువలెనే ఆ తేజస్సును సమర్పించెను. నిత్యమువలెనే ఫలమనుకొని ఆ తేజఃపిండమును అంజనాదేవి భక్షించెను.

శ్లో॥ నాతిదీర్ఘేణ కాలేన చాఽంజనా పతిదేవతా ।
స్వాంగేషు గర్భచిహ్నాని సా దృష్ట్వా హ్రీమనా హ్యభూత్ ॥౩౦॥

తా॥ కొద్దికాలమునందే ఆ అంజనాదేవి గర్భమును ధరించి గర్భచిహ్నములను చూచి లజ్జపొందెను.

శ్లో॥ విస్మయావిష్టచిత్తాం తాం వ్రతభంగవిశంకితాం ।
ధ్యాయంతీం భయవిత్రస్తామాభాష్యాహాశరీరిణీ ॥30॥

తా॥ హఠాత్తుగా గర్భము ధరించుటచే ఆశ్చర్యమును పొందినదిన్నీ వ్రతభంగమువలన భయముగలదిన్నీ ధ్యానించుచున్నదిన్నీ అయినట్టి అంజనాదేవిని గురించి ఆకాశవాణి పలికెను.

శ్లో॥ మాభూత్తే వ్రతభంగోఽయం మా విషీద వరాననే । దేవప్రసాదాత్తే గర్భే మహావ్యక్తిర్భవిష్యతి ॥31॥

తా॥ ఓ అంజనాదేవీ నీకు వ్రతభంగము కాలేదు. విచారించనక్కరలేదు. భగవత్ప్రసాదముచే నీగర్భమందు మహానుభావుడు పుట్టగలడు.

శ్లో॥ ఏవముక్తాతు సా దేవీ ముదా పరమయా యుతా ॥ వైశాఖే మాసి కృష్ణాయాం దశమీ మందసంయుతా ॥ పూర్వప్రోష్ఠపదాయుక్తా అథా వైధృతిసంయుతా । తస్యాం మధ్యాహ్న వేళాయాం జనయామాస వైసుతమ్। మహాబలం మహాసత్వం విష్ణుభక్తిపరాయణమ్ ॥ సర్వదేవమయం వీరం బ్రహ్మవిష్ణుశివాత్మకం। వేదవేదాంగ తత్త్వజ్ఞం సర్వవిద్యావి

శారదమ్॥ సర్వబ్రహ్మవిదాం శ్రేష్ఠం సర్వదర్శనసమ్మతం। మాణిక్యకుండలధరం దివ్యపటాంబరావృతమ్ ॥ కనకాచలసంకాశం పింగాక్షం హేమమాలినం । స్వర్ణయజ్ఞోపవీతం చ మణినూపురశోభితమ్॥ ధ్వజవజ్రాంకుశచ్ఛత్ర పద్మరేఖాంఘ్రిసంయుతం, దీర్ఘలాంగూలసహితం దీర్ఘకాయం మహాహనుమ్॥ కౌపీనకటిసూత్రాభ్యాం విరాజంతం మహాభుజం । ఆశ్చర్యభూతం లోకానాం వజ్రసంహననం కపిమ్॥ సర్వలక్షణసంపన్నం కిరీటకనకాంగదం । ప్రభయాఽమితయా విష్ణోరవతారమివాపరమ్॥

తా॥ ఈప్రకారముగా ఆకాశవాణిచే చెప్పబడినదై సంతోషముతో కొంతకాలముగడిపెను. అనంతరము వైశాఖమాసమున కృష్ణపక్ష దశమీ మందవారమున పూర్వాభాద్రా నక్షత్రము, వైధృతినామయోగము. అట్టి సమయము మధ్యాహ్నవేళయందు మహాబలము కలిగినవాడును విష్ణుభక్తితత్పరుడు నిగ్రహానుగ్రహాసమర్థుడు వేదవేదాంగతత్త్వములను తెలిసినవాడును బ్రహ్మవేత్తలలో శ్రేష్ఠుండును వేదశాస్త్రములయందు చెప్పబడిన మహిమకలవాడున్నూ మాణిక్యకుండలములను ధరించినవాడును దివ్యపీతాంబరమును ధరించినవాడును మేరుసమానుడును స్వర్ణమాలికలను స్వర్ణయజ్ఞోపవీతమును మణినూపురములను ధరించినటువంటివాడును ధ్వజ వజ్ర అంకుశ చ్ఛత్ర పద్మరేఖలతో గూడిన పాదపద్మములు కలిగినటువంటివాడును పెద్దదైనటువంటి వాలమున్నూ

పెద్దదయిన శరీరమున్నూ బ్రహ్మతేజఃపుంజితమైు ముఖపద్మము కలిగినటువంటివాడున్నూ సర్వలక్షణసంపన్నుడున్నూ సర్వై శ్చర్య నిధియున్నూ గొప్పవైన భుజములు కలిగినటు వంటివాడున్నూ కాంతిచేత విష్ణుమూర్తియొక్క అవతా రమువలె నున్నవాడున్నూ అయిన కుమారుని అంజనాదేవి కనెను.

శ్లో॥ పపాత పుష్పవృష్టిశ్చ నేదు ర్దుందుభయో దివి । ననృతుర్దేంగన్ధర్వా స్తుష్టువుస్సిద్ధచారణాః ॥ వవౌ వాయుస్సుఖ స్పర్శం సరితో నిర్మలోదకాః ॥

తా॥ ఆసమయమునందు దేవతలు పుష్పవర్షము కురి పించిరి. దేవదుందుభులు శుభధ్వని చేసినవి. అప్సరః స్త్రీలు నాట్యముచేసిరి. గంధర్వులు సంగీతమును పాడిరి. సిద్ధచార ణులు సంతోషముతో స్తుతిచేసిరి. వాయువులు సుఖముగా సంచరించినవి. నదులు నిర్మలోదకములై ప్రవహించినవి.

శ్లో॥ యదాంజనా కేసరిధర్మపత్నీ హ్యసూత బాలం కపిసార్వభౌమం । ప్రదక్షిణాకారశిఖం మునీనాం తదైవ వహ్నిత్రితయం విరేజే ॥

తా॥ ఏసమయమునందు అంజనాదేవివానరసార్వభౌము డైనమహానుభావునికనెనో ఆసమయమందుమునీశ్వరులయొక్క గార్హపత్యము ఆహవనీయమూదక్షిణాగ్నియను అగ్నిత్రయము ప్రదక్షిణజ్వాలలతో శుభసూచకముగా ప్రకాశించినది.

శ్లో॥ ప్రసూనాతిగంధానిలసంభృతేషు వనేషు మత్తా మక రందనిర్ఝరైః । మిళిందసంఘా విచరంతి సర్వతస్సకోరకైః పల్లవితద్రుమేషు ॥

అర్థము ॥ ప్రసూనాతిగంధానిలసంభృతేషు = పుష్పపరి మళమిళితవాయువులతో కూడినట్టియు, పల్లవితద్రుమేషు = వికసించినవృక్షములుకల,వనేషు=వనములయందు,సకోరకైః= మొగ్గలతో కూడిన, మకరందనిర్ఝరైః = మకరందప్రవాహ ములచే, మత్తాః=మదించినవై, మిళిందసంఘాః = తుమ్మెదల గుంపులు, సర్వతః = అంతట, విచరంతి = సంచరించినవి.

తా॥ వనములయందు పుష్ప పరిమళములతో కూడిన వృక్షములయందు తుమ్మెదలు సుఖముగ సంచరించినవి.

శ్లో॥ పతంతి రత్నాని సురేతరాణాం కిరీటకోటిగ్రథి తాన్యకాండే । తదంగనామానసగహ్వరేషు సగర్భకంపం భయమావివేశ ॥

టీక ॥ సురేతరాణాం = రాక్షసులయొక్క, కిరీటకోటి గ్రథితాని = కిరీటములయొక్క అంచులయందు అతకబడిన, రత్నాని = రత్నములు, అకాండే = కారణములేకయే, పతంతి = రాలుచున్నవి, తదంగనామానసగహ్వరేషు = ఆ రాక్షసస్త్రీలయొక్క మనస్సులనే గుహాలయందు, సగర్భ కంపం = గర్భముయొక్కవణకుతో కూడుకున్న, భయం = భయము, ఆవివేశ = ప్రవేశించెను.

టీ॥ రాక్షసులు శిరస్సులయందు ధరించిన కిరీటస్థగిత రత్నములు అకస్మాత్తుగా రాలినవి. ఆ రాక్షసస్త్రీలు భయమునుపొందిరి. ఈప్రకారముగా ఆ హనుమజ్జన్మమహోత్సవమందు లోకములకు సుఖమున్నూ లోకబాధకులైన రాక్షసులకు దుఃఖమున్నూ కలిగెను.

శ్లో॥ తతః ప్రోవాచ తాం బాలశ్చతుర్పంచదినాంతరే॥ అమాయాం మాతరం దృష్ట్వా ఆహారో మే ప్రదీయతామ్ ॥

టీ॥ అనంతరమందు ఆమహాబాలుడు నాలుగుఅయిదు దినములయందు అమావాస్యనాడు తల్లినిచూచి 'అమ్మానాకు ఆహారముకావలె' నని అడిగెను.

శ్లో॥ ఇత్యుక్తా ప్రాహ తం దేవీ లాలయంతీ సుతం సతీ । సుపక్వంచ ఫలం సూనో యత్ర కుత్రాపి భుజ్యతామ్ ॥

టీ॥ ఈప్రకారముగా అనగబడిన ఆ అంజనాదేవి కుమారుని లాలనచేయుచు, ఎక్కడదొరికితే అక్కడ పరిపక్వమైన ఫలమును భక్షించుమని చెప్పెను.

శ్లో॥ ఆంజనేయః ప్రహృష్టాత్మా దివముత్పత్య వేగతః॥ శిశురుద్యంతమాదిత్యం ఫలబుద్ధ్యా గృహీతవాన్ ॥

టీ॥ బాలుడైన ఆంజనేయమూర్తి సంతోషించినవాడై ఎదురుగా ఉదయించుచున్న ఆదిత్యమండలమును జూచి ఆకాశమునకు ఎగిరి ఫలమనే బుద్ధిచేత పట్టుకొనెను.

శ్లో॥ ముఖేన గళితం భానుం దృష్ట్వా కోపాత్పురందరః।
చింతయామాస కోన్వేష మహాసత్వః ప్రదృశ్యతే ॥ ఇతి విస్మ
యమాపన్నో వజ్రముద్యమ్య వృత్రహా। బాలే చిక్షేప
రోషాచ్చ రోమ్ణా వజ్రమపోథయత్ ॥ మోఘం తత్ కులిశం
దృష్ట్వా బ్రహ్మణోస్త్రమయోజయత్। తచ్చాపి రోమ్ణా
చిక్షేప విస్మితాశ్చాభవన్సురాః ॥

తా॥ ముఖముచే భక్షించబడినసూర్యుని చూచి దేవేం
ద్రుడు కోపగించినవాడై, మహాబలముకల ఇతను యెవరు! అని
ఆలోచించి ఆశ్చర్యమును పొంది వజ్రాయుధమును యెత్తి
ఆబాలుడైన ఆంజనేయమూర్తిమీదికి విడిచెను. ఆవజ్రాయుధ
మును ఆబాలుడు వాలాగ్రభాగమందున్న రోమముచే దూర
మొనర్చెను. వ్యర్థమైన వజ్రాయుధమును చూచి ఇంద్రుడు
బ్రహ్మాస్త్రమును ప్రయోగించెను. ఆమారుతి బ్రహ్మాస్త్రము
నున్నూ మరియొకరోమముచే పరిహరించెను. దేవతలు ఇది
చూచి ఆశ్చర్యము నొందిరి.

శ్లో॥ తతస్తం ప్రార్థయాంచక్రుః పితామహపురోగమాః॥
అంజనానుప్రజా వీర పార్వతీశ్వరసంభవ॥ సమర్థోసి మహావీర
మహాబలపరాక్రమః। నరాణాం చ సురాణాం చ ఋషీణాం
చహితాయ వై ॥ జగత్ప్రాణకుమారస్త్వ మవతీర్ణోసి
భూతలే। సత్క్రియా న ప్రవర్తంతే వేదోక్తాః క్రతవస్తథా॥
త్యజ సూర్యమితి ప్రోక్తస్సముమోచ ప్రభాకరమ్॥

తా॥ అనంతరమందు బ్రహ్మాదిదేవతలందరు అచ్చట ప్రత్యక్షమై ఆబాలుని, అంజనాదేవికి కుమారుడవు; పార్వతీ పరమేశ్వరుల కుమారుడవు; నీయందు బలశౌర్యధైర్యాది గుణము లనేకములు కలవు; సమర్థుడవు. దేవఋషి మానవుల యొక్క హితముకొరకు వాయువునకు కుమారుడవై అవతారము నొందితివి। నీకు సమానులు లేరు ఓబాలుడా ప్రపంచ మందు సత్కర్మలు వేదోక్త క్రతువులు జరుగుటలేదు. సూర్య దేవుని విడువుమా. అని ప్రార్థింపగా హనుమంతుడు సూర్య దేవుని విడిచెను.

శ్లో॥ ఏతదాశ్చర్యమాలోక్య కులిశం మేఘవాహనః । సమర్థమపి చాపల్యాత్క్రీడాసక్తం శిశుం కపిమ్॥ హనౌ చిక్షేప వేగేన స పపాత శిలాతలే॥

తా॥ ఈ ఆశ్చర్యమును చూచి ఇంద్రుడు ఆపిల్లవానిని క్రీడాసక్తునిగా తెలుసుకొని వజ్రాయుధమును తీసుకుని దవుడ మీద కొట్టెను. అంత నాపిల్లవాడు శిలాప్రదేశమందుపడెను.

శ్లో॥ మూర్ఛితం బాలకం దృష్ట్వా వాయుః పరమ కోపనః । ప్రాణాన్సర్వశరీరేషు నిగృహ్యా న చచాల హా॥

తా॥ మూర్ఛితుడైన ఆకుమారుని చూచి వాయు దేవుడు ఆగ్రహమును పొంది సమస్తశరీరములయందున్న ప్రాణవాయువులను నిగ్రహించి కదలకుండెను.

శ్లో॥ ప్రాణేషు నిగృహీతేషు న ప్రవృత్తాః క్రియా స్తతః॥ అచేతనవదత్యంతసమ్మూఢమభవజ్జగత్ ॥

తా॥ ప్రాణవాయువులను నిగ్రహించగానే వ్యాపారములు జరుగుటలేదు. జగత్తు చైతన్యములేక మూఢమైనదాయెను. అనగా జగత్ప్రియమువారు మృతప్రాయులైరి.

శ్లో॥ తతో దేవాస్సగంధర్వాస్సిద్ధాశ్చ పరమర్షయః । బ్రహ్మ విష్ణుశ్చ శంభుశ్చ శక్రశ్చాపి సమాగతాః॥ వరైస్తం ఛందయామాసుర్వాయుం విబుధదుర్లభైః ॥

తా॥ అనంతరమందు దేవగంధర్వసిద్ధ పరమర్షులున్నూ బ్రహ్మవిష్ణురుద్రులున్నూ ఇంద్రాది దిక్పాలకులున్నూ ఆవాయుదేవుని, నీకుమారునికి వరములిచ్చుచుంటిమని ప్రార్థించి అనేక వరములు ఆకుమారునికి యిచ్చిరి

శ్లో॥ దీర్ఘమాయుర్బలం శౌర్యమారోగ్యంచాఽప్యధృష్యతాం । బుద్ధిం విద్యాస్తప స్తేజో వాక్పటుత్వం ప్రసన్నతమ్॥ చాతుర్యం ధైర్యవైరాగ్యే విష్ణుభక్తిం కృపాళుతాం। పరనారీషు వైముఖ్యమపచారసహిష్ణుతామ్॥ అజేయత్వం చ సర్వాస్త్రైస్సరైర్దేవాసురైరపి । ఏతానన్యాంశ్చ కల్యాణవరాన్దత్త్వా యయుస్సురాః॥

తా॥ దీర్ఘమైన ఆయువు బలము శౌర్యము ఆరోగ్యము అధృష్యత్వము బుద్ధి విద్య తపము తేజస్సు వాక్పటు

త్వము ప్రసన్నత్వము చాతుర్యము ధైర్యము వైరాగ్యము విష్ణుభక్తి కృపాళుత్వము పరస్త్రీపరాఙ్ముఖత్వము అపచారము సహించుట అస్త్రబాధ లేకపోవుట అనే ఈవరములనున్నూ మరికొన్ని వరములనున్నూ ఆ ఆంజనేయమూర్తికి ఇచ్చి దేవతలు వెళ్లిరి.

శ్లో॥ తతస్తుష్టావాంజనేయం బ్రహ్మా లోకపితామహః॥

తా॥ అనంతరము అంజనేయమూర్తిని బ్రహ్మదేవుడు స్తుతించెను.

బ్రహ్మోవాచ॥ శ్లో॥ సాక్షాద్విష్ణురివ శ్రీమాన్దేవానుద్ధారయిష్యసి। సర్వరాక్షససంహారం కరిష్యసి యథా హరః॥ లంకాదైత్యవధం కృత్వా రామకార్యపరాయణః। సంజీవనాచలం నీత్వా లక్ష్మణం జీవయిష్యసి। సీతాప్రవృత్తిమానీయ రామం సంతోషయిష్యసి। త్వం బుద్ధిమాన్మహాశూరో మహాబలపరాక్రమః॥ భవానజేయస్సర్వాస్త్రైస్తథాపి ప్రార్థనామ్మమ। అంగీకార్యం త్వయా వీర క్షణం బ్రహ్మాస్త్రబంధనమ్॥

తా॥ నీవు విష్ణుమూర్తివలెనే దేవతలను ఉద్ధరించగలవు; ఈశ్వరునివలెనే రాక్షసవధ చేయగలవు; రామకార్య తత్పరుడవై లంకయందు రాక్షసవధచేసి సంజీవపర్వతమును తెచ్చి లక్ష్మణమూర్తిని బ్రతికించగలవు; చాలా బుద్ధియుంటివాడవు; పరాక్రమశాలివి; సర్వాస్త్రములు నిన్నుఏమియు చేయజాలవు; అయినను నాప్రార్థనమువల్లనుంచి క్షణమాత్రము బ్రహ్మాస్త్రబంధనమును అంగీకరించవలెను.

శ్లో॥ మహాదేవప్రభావాద్ధి రుద్రస్యామితతేజసః । తేజసోపి సురాణాం త్వమైశ్వరం తేజ ఊర్జితమ్॥

తా॥ నీవు రుద్రాదిదేవతలయొక్క తేజస్సువల్లనుంచి కలిగిన మహాతేజస్స్వరూపుడవు.

శ్లో॥ పార్వతీగర్భసంభూతేః పార్వతీగర్భనామవాన్ । అగ్నినా ధార్యమాణత్వాదగ్నిగర్భో భవాన్భవేత్ ॥ వాయుప్రసాదజననాద్వాయుపుత్రో నిగద్యసే । అంజనాగర్భజననాదాంజనేయ స్తతో భవాన్॥ కేసరిక్షేత్రజన్యత్వాత్పుత్రః కేసరిణః కపేః । హనూవజ్రప్రహారాద్ధి హనూమానితి నామతే॥ బ్రహ్మవిష్ణుశివాంశత్వా త్త్రిమూర్తిరితి విశ్రుతః । సర్వదేవాంశ సంభూతేః సర్వదేవమయః స్మృతః॥ హనూమత్పూజయా తస్మాత్పూజితాస్సర్వదేవతాః । ప్రతిగ్రామనివాసశ్చ భూయాద్రక్షోనివారణే॥ ఇత్యుక్త్వా లోకనాథోఽపి తత్రైవాంతరధీయత॥

తా॥ నీవు పార్వతీగర్భమందు ప్రవేశించుటవలన పార్వతీగర్భుడవనియు అగ్నిచే ధరించబడుటవలన అగ్నిగర్భుడవనియు వాయువువలన జన్మించుటవలన వాయుకుమారుడవనియు అంజనాగర్భజననమువలన ఆంజనేయుడవనియు కేసరిభార్యయందు పుట్టుటవలన కేసరికుమారుడవనియు హనువులయందు వజ్రప్రహారముకలిగియుండుటవలన హనుమంతుడవనియు బ్రహ్మవిష్ణుశివతేజస్స్వరూపుడవగుటవలన త్రిమూర్త్యాత్మకుడవనియు సర్వదేవతేజస్స్వరూపుడవగుటవలన సర్వదేవస్వరూపుడవనియు

ఇట్టి మంగళప్రదమైన నామములచే వ్యవహరింపబడగలవు. సకలదేవతా తేజస్స్వరూపుడవైన నిన్ను పూజించుటచేత దేవతలందరు పూజింపబడినవారలగుదురు. ప్రతిగ్రామము నీకు నివాసస్థానమగును. సమస్తజనులచే పూజింపబడగలవు. రాక్షస సంహారము చేయగలవు. అని బ్రహ్మదేవుడు వరము లిచ్చి అంతర్ధాన మొందెను.

శ్లో॥ ఆంజనేయస్తతః కాలే బ్రహ్మచర్యపరాయణః। సమర్థోపి మహాతేజాస్సంపశ్యన్లోకసంగ్రహాన్॥ సూర్యమండల ముత్ప్లుత్య వేదాధ్యయనకారణాత్। సప్రశ్రయమువాచేదం నమస్కృత్య దివాకరమ్॥

తా॥ అనంతరమందు బ్రహ్మచర్య వ్రతమును చేయుచు ఆంజనేయమూర్తి లోకసంగ్రహమును ఆలోచించినవాడై సమర్థుడైనప్పటికి వేదాధ్యయనముకొరకు సూర్యదేవుని దగ్గరకు వెళ్ళి నమస్కరించి వినయముతో సూర్యునిగురించి ఇట్లనెను.

శ్లో॥ సాంగోపనిషదో వేదాన్మమ వ్యక్తుంత్వమహసి। రవిః ప్రోవాచాంజనేయమవకాశో న విద్యతే॥

తా॥ వేదవేదాంగములను నీవు నాకు ఉపదేశించుమని సూర్యుని కోరగా ఆదిత్యుడు అవకాశములేదని చెప్పెను॥

శ్లో॥ ఈశ్వరస్య వశే తిష్ఠన్స్వమామీహాతదాజ్ఞయా। ఇత్యుక్తో హనుమానేకపాదయుణ త్తస్య పద్ధతిమ్॥

తా॥ ఈశ్వరునియొక్క వశమందున్నవాడనై తదీయాజ్ఞచే ఈప్రకారము నిత్యము తిరుగుచుంటిని. అని సూర్యుడు చెప్పగా ఆహనుమంతుడు కోపముతో సూర్యుని మార్గమును అడ్డగించెను.

శ్లో॥ త్వమేవోపాయమవక్తేతి సాంత్వయామాస తంరవిః। సూర్యోన్ముఖం పృష్ఠగతో హనూమానేకవాసరే॥ ఇంద్రవ్యాకరణం సూర్యాద్ధారయంశ్చ మహాత్మనః॥

తా॥ సూర్యునికియెదురుగా నిలబడి వెనుకకు నడచుచు ఒక్కరోజున సూర్యునిదగ్గర ఇంద్రవ్యాకరణమును చదివెను.

శ్లో॥ తతో హనూమానేకం స్వం పాదం కృత్వోదయాచలే। అస్తాద్రావేకపాదం చ తిష్ఠన్నభిముఖో రవేః। సాంగోపనిషదో వేదానవాప్య కపిపుంగవః। ఖాస్కారం తోషయామాస సర్వవిద్యావిశారదః॥

తా॥ అనంతరము ఆంజనేయులు ఒకపాదమును ఉదయాద్రియందున్నూ ఒకపాదమును అస్తాద్రియందున్నూ ఉంచి సూర్యుని కెదురుగా నిలిచి సాంగోపాంగముగా వేదములను చదివి సూర్యదేవుని సంతోషపరచెను.

శ్లో॥ తస్య బుద్ధిం చ విద్యాంచబలశౌర్యపరాక్రమాన్। విచార్య తస్మై ప్రదదౌ స్వస్య కన్యాం సువర్చలామ్॥ తాముద్వాహ్య మహాతేజా హనుమాన్మారుతాత్మజః। భూయః కిలికిలాంకుర్వన్నునరాయాన్మహాకపిః॥

తా॥ అతని యొక్క బుద్ధివిశేషమునున్నూ విద్య లనున్నూ బల శౌర్య పరాక్రమములనున్నూ చూచి సూర్యదేవుడు సంతోషించి తనయొక్క కుమార్తెయైన సువర్చలాదేవిని అతనికిసమర్పించెను. హనుమంతుడు సువర్చలాదేవిని వివాహ మాడి కిలికిలాశబ్దమును చేయుచు స్వేచ్ఛగా వెళ్ళెను.

శ్లో॥ ఇదం హనూమచ్చరితం యే శృణ్వంతి పఠంతి చ। లిఖంతి పుస్తకే వాఽపి సర్వాన్కామానవాప్నుయుః॥

తా॥ ఈహనుమచ్చరిత్రమును చదివినవారును విన్న వారును లిఖించినవారును సమస్తములైన కోరికలను పొందుదురు. అని మైత్రేయునకు పరాశరమహర్షి చెప్పెను.

శ్లో॥ సువర్చలాసమేత శ్రీహనుమద్ద్వాదశాక్షరం। యే జపంతి మహాత్మానో లభంతే తే మనోరథాన్॥

తా॥ సువర్చలాసమేతుడగు హనుమంతుని ద్వాదశా క్షరమంత్రమును యెవరు జపించుదురో ఆమహానుభావులు ఇష్టసిద్ధినొందుదురు.

శ్లో॥ జయంతీ నామపూర్వోక్తా హనూమజ్జన్మవాసరః। తస్యాం భక్త్యా కపివరం నరా నియతమానసాః॥ జపంతశ్చార యంతశ్చ పుష్పపాద్యార్ఘ్యచందనైః। ధూపైర్దీపైశ్చనై వే ద్యైఃఫలైః బ్రాహ్మణభోజనైః॥ సమంత్రార్ఘ్యప్రదానైశ్చ నృత్యగీతైస్తథై వ చ। తస్మాన్మనోరథాన్సర్వాన్లభంతే నాత్రసంశయః॥

తా॥ పూర్వమునందు హనుమజ్జయంతిఅని చెప్పితిమి. ఆ జయంతి అనగా హనుమంతుని జన్మదినము. ఆ హనుమ జ్జయంతియందు నియతమైన మనస్సు కలవారై యెవరు. హనుమంతుని అర్ఘ్యపాద్యాదులచే పూజించి పూజాంతమందు హనుమత్కథాశ్రవణ మొనరించి మంత్రార్ఘ్యములనిచ్చి బ్రాహ్మణసమారాధనముచేసి హనుమత్ప్రీతి చేయుదురో అట్టి మహానుభావులు ఆంజనేయుని అనుగ్రహముచే సర్వసిద్ధులను పొందుదురు; ఇది సత్యము.

శ్లో॥ ఏకో దేవస్సర్వద శ్రీహనుమానేకో మంత్రశ్శ్రీ హనూమత్ప్రకాశః । ఏకా మూర్తిః శ్రీహనూమత్స్వరూపా చైతం కర్మ శ్రీహనూమత్సపర్యా॥

తా॥ శ్రీహనుమద్దేవుడే దేవుడు. ఆంజనేయుని మంత్రమే మంత్రము. ఆంజనేయ విగ్రహమే విగ్రహము. ఆంజనేయ పూజాకర్మయే కర్మ. కాన ఆ పూజయే ప్రధానముగా చేయవలెను.

శ్లో॥ జలాధీనా కృషిస్సర్వా భక్త్యధీనం తు దైవతం । సర్వం హనుమతోఽధీనమితి మే నిశ్చితా మతిః॥

తా॥ వ్యవసాయము జలాధీనమైనది. దేవత భక్తి కధీనమైనది. సమస్తము హనుమంతుని కధీనమైనది. ఇది నానిశ్చయము.

శ్లో॥ హనూమాన్కల్పవృక్షో మే హనూమాన్మమ కామధుక్ । చింతామణిస్తు హనుమానో విచారః కుతో భయమ్॥

తా॥ నాకు హనుమంతుడేకల్పవృక్షము, హనుమంతుడే కామధేనవు, హనుమంతుడే చింతామణి గాన విచారములేదు; భయములేదు; అని హనుమజ్జన్మకథా వృత్తాంతమును జయంతీ వృత్తాంతమును మైత్రేయమహామునికి పరాశరమహాముని ఉపదేశించెను.

ఇతి శ్రీహనుమజ్జయంతికథాయాం హనుమజ్జన్మకథనం
సమాప్తమ్.

శ్రీ శివాయగురవేనమః (పూజావిధానం) ఆచమ్య, దేశకాలౌ సంకీర్త్య, గోత్రస్య, నామధేయస్య ధర్మపత్నీ సమేతస్య శ్రీసువర్చలా సహిత ఆంజనేయ ప్రసాదేన ఆయు రారోగ్య ఐశ్వర్యాభివృద్ధ్యర్థం పుత్రపౌత్రాభి వృద్ధ్యర్థంచ హనుమజ్జన్మ దివసే శ్రీ సువర్చలాసహిత ఆంజనేయస్వామి దేవతాముద్దిశ్య ప్రీత్యర్థం. పురుషసూక్త శ్రీసూక్తవిధాన కల్పోక్త విధానేనచ షోడశోపచార పూజాంచ కరిష్యే ఆదౌ దీపారాధనంకృత్వా, తదుపరిగణపతి పూజాంచకుర్యాత్. తదంగకలశారాధనం కుర్యాత్ । కలశే గంధపుష్పాణ్య భ్యర్చ్య । కలశస్యముఖే = సన్నిధిం కురుబ్రహ్మాండోదర తీర్థాని కరైస్స్పృష్టాని తేరవే । తేనసత్యేనమేదేవతీర్థం దేహి దివాకర । ఓం సర్వానంద తీర్థమయశక్తి ఏహ్యేహిస్వాహా ।

క్రోమిత్వం కళశమ ద్రయాణం నమో భగవత్యంచె అంబాల్యర బికె అశేషతీర్థాలవాలె ఐం హ్రీం శ్రీం శివజటాధిరూఢె గంగె గంగాంబికేస్వాహా । కలశోదకేన దేవమాత్మానం సంప్రోక్ష్య పూజాద్రవ్యాణిచ సంప్రోక్ష్య । పీఠపూజాం కరిష్యే । అం అర్క మండలాయనమః । చం చంద్రమండలాయనమః । రం అగ్నిమండలాయనమః ।

## అష్టదళేషు

ఓం విమలాయనమః ఓం ఉత్కర్షిణ్యైనమః ఓం జ్ఞానక్రియాయైనమః । ఓం యోగాయైనమః । అష్టదళాంతరే అనుగ్రహాయనమః । ఓం నమోభగవతే విష్ణవేనమః । ఓం నమో భగవతే సర్వభూతాత్మనేనమః । ఓం నమోభగవతే యోగపీఠాత్మనేనమః । ఓం నమోభగవతే మంత్రపీఠాత్మనేనమః । ఇతి పీఠపూజా, అథద్వారపూజా । ప్రాగ్ద్వారే ద్వారశ్రియై నమః । ధాత్రేనమః । విధాత్రేనమః । దక్షిణద్వారే ద్వారశ్రియైనమః । జయాయనమః । విజయాయనమః । పశ్చిమ ద్వారె ద్వారశ్రియైనమః । చండాయనమః । ప్రచండాయ నమః । ఉత్తరద్వారె ద్వారశ్రియైనమః । బలాయనమః ప్రబలాయనమః । విదిక్షు । ఆగ్నేయాం ధర్మాయనమః అధర్మాయనమః । నైరృత్యాం జ్ఞానాయనమః అజ్ఞానాయ నమః । వాయవ్యాం । వైరాగ్యాయనమః । అవైరాగ్యాయ నమః । యీశాన్యాం । ఐశ్వర్యాయనమః । అనైశ్వర్యాయ నమః । సర్వాధారపీఠశక్తిభ్యోనమః । పీఠమధ్యే దేవంనం

ష్ఠాప్య । సంతప్త హేమవర్ణం బ్రహ్మ పిష్టీకేశసంయుతం
హేమమత్సరమాత్మానం ధ్యాయేద్దేవం జగత్పతిం । ధ్యాయే
ద్వానర నారసింహ ఖగరాట్ = పీతాంబరం వానరం । ఆవా
హితో భవ । స్థాపితో భవ । (సన్నిహితో భవ) సన్నిధ్ధో భవ ।
సన్నిరుద్ధో భవ । సమ్ముఖో భవ । అవకుంఠితో భవ । సుప్రసన్నో
భవ । అమృతీభవ । ప్రాణప్రతిష్ఠా । అసునీతె = అథ ఆవరణ
పూజా ।

ఆం అంజనాసుతాయనమః । హృదయ దేవమావాహ
యామి పూజయామి. ఈం రుద్రమూర్తయేనమః శిరో దేవ
పూజయామి । ఊం వాయుసూనవేనమః । శిఖా దేవమావాహ
మావాహయామి యామి పూజయామి। ఐం అగ్నిగర్భాయనమః
కవచ దేవమావాహయామి పూజయామి। ఔం శ్రీరామముఖ్య
దూతాయనమః నేత్ర దేవమావాహయామి పూజయామి । అః
బ్రహ్మాస్త్రనివారణాయనమః । అస్త్ర దేవమావాహయామి
పూజయామి । ఇతి ప్రథమావరణ పూజా । అథ ద్వితీ
యావరణం । జాం జాంబవతేనమః । జాంబవంత మావాహ
యామి పూజయామి। విం వినతాయనమః । వినతామావాహ
యామి పూజయామి ।. నీం నీలాయనమః నీలమావాహయామి
పూజయామి । పం పనసాయనమః పనసమావాహయామి పూజ
యామి । గం గంధమాధనాయనమః । గంధమాధన
మావాహయామి పూజయామి । సుం సుషేణాయనమః ।
సుషేణమావాహయామి పూజయామి । మైం మైందాయ

నమః । మైందమావాహయామి పూజయామి। ద్వీం ద్వివిదాయ నమః । ద్వివిదమావాహయామి పూజయామి । ఇతి ద్వితీయావరణపూజా (అథతృతీయావరణం) లం ఇంద్రాయనమః ఇంద్రదేవమావాహయామి పూజయామి । రం అగ్నయేనమః అగ్నిదేవమావాహయామి పూజయామి హం యమాయనమః యమదేవమావాహయామి పూజయామి షం నిర్ ఋతయే నమః నిర్ ఋతిదేవమావాహయామి పూజయామి వం వరుణాయనమః వరుణదేవమావాహయామి పూజయామి యం వాయవేనమః. వాయుదేవమావాహయామి పూజయామి. సం కుబేరాయనమః కుబేరదేవమావాహయామి పూజయామి శం ఈశానాయనమః ఈశానదేవమావాహయామి పూజయామి. ఇతి తృతీయావరణం (అథ చతుర్థావరణపూజా) వం వజ్రాయనమః । వజ్రదేవమావాహయామి పూజయామి శం శక్తయేనమః శక్తిదేవమావాహయామి పూజయామి దం దండాయనమః దండదేవమావాహయామి పూజయామి ఖం ఖడ్గాయనమః ఖడ్గదేవమావాహయామి పూజయామి. పం పాశాయనమః । పాశదేవమావాహయామి పూజయామి ధ్వం ధ్వజాయనమః।ధ్వజదేవమావాహయామి పూజయామి గం గదాయై నమః । గదా దేవమావాహయామి పూజయామి త్రిం త్రిశూలాయనమః । త్రిశూల దేవమావాహయామి పూజయామి. ఇతి చతుర్థావరణ పూజా॥ - ఓం హ్రీం హరిమర్కట మర్కటాయ స్వాహా. శ్రీసువర్చలాసహిత ఆంజనేయస్వామినేనమః చతుర్థావరణ పూజాం సమర్పయామి । (షోడశోపచారపూజ)

## ఆ వా హ న ం

ఓం సహస్ర శీర్షా పురుషః - స్సహస్రాక్షః స్సహస్రపాత్ । స భూమిం విశ్వతో వృత్వాత్యతిష్ఠద్దశాంగులం । హిరణ్యవర్ణాం హరిణీం సువర్ణ రజతస్రజాం । చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ । శ్లో॥ అథ ధ్యాయేత్కపిశ్రేష్ఠం చతురావరణాన్వితం । వామభాగస్థితాం పత్నీం సూర్యపుత్రీం సువర్చలాం । పశ్యంత స్నిగ్ధయావృష్ట్యా స్మితయుక్త ముఖాంబుజాం । ఛత్రచామరసంయుక్తం వినతాద్యైస్సుసేవితం । ముక్తాహారగణోపేతం రత్నకుండల భూషితం । గ్రైవేయభూషితగ్రీవం కనకాంగదధారిణం । నానా మణి సముత్కీర్ణం కిరీటోజ్వల శేఖరం । మేఖలాదామసంవీతం మణినూపురశోభితం । రత్నకంకణవిద్యోతిం పాణిరక్తాంబుజ ద్వయం । క్వధితస్వర్ణ వర్ణాంగముష్ట్రిధ్వజ సమన్వితం । పద్మాసనే సమాసీనంపీతాంబరసమన్వితం । చతుర్భుజధరంశాంతం సర్వవ్యాపినమీశ్వరం । సర్వదేవపరివారంసర్వాభీష్ట ఫలప్రదం । ఆవాహయామిసర్వేశంసూర్యపుత్రీ ప్రియం ప్రభుం ఓంహ్రీంహరిమర్కటమర్కటాయస్వాహా ॥ శ్రీసువర్చలా సహిత ఆంజనేయస్వామినే నమః । ఆవాహనం సమర్పయామి

ఆసనం॥ పురుష వేదగ్ంసర్వం = తిరోహతి । తాంమ ఆవాహ = పురుషానహం । అంజనాతనయందేవంమాయాతీతం జగద్గురుం । దేవదేవజగన్నాథ కేసరిప్రియనందన । రత్నసింహాసనంతుభ్యందాస్యామిహనుమత్ప్రభో । ఆగచ్ఛ హను

మన్ దేవత్వం సువర్చలయాసహ । పూజాసమాప్తిపర్యం తంథవసన్నిహితోముదా । ఓం హ్రీంహారిమర్కట = స్వాహా । శ్రీసువర్చలాసహితఆంజనేయస్వామినేనమః । నవరత్నఖచిత సింహాసనం సమర్పయామి-

పాద్యం, ఏతావానస్యమహిమా = దివి అశ్వ పూర్వాం = జమతాం । భీమాగ్రజమహాప్రాజ్ఞత్వంమమాభి ముఖోభవ । సువర్చలాపతే శ్రీమత్ప్రసీదజగతాంపతే । యోగిధ్యేయాంఘ్రి పద్మాయజగతాం పతయేనమః । పాద్యం మయార్పితం దేవగృహాణ పురుషోత్తమ । ఓం హ్రీం హారి = స్వాహా । శ్రీసువర్చలాసహిత ఆంజనేయస్వామినేనమః । పాదయోః పాద్యం సమర్పయామి - (అర్ఘ్యం) త్రిపాదూర్ధ్వ ఉదైత్పురుషః = అభి । కాంసోస్మితాం = శ్రియం । లక్ష్మణ ప్రాణ సంరక్షసీతాశోక వినాశన । గృహాణార్ఘ్యం మయా దత్తం పార్వతి ప్రియనందన । ఓం హ్రీం హారి = స్వాహా । శ్రీసువర్చలా = నమః । హస్తయోః అర్ఘ్యం సమర్పయామి

ఆచమనం । తస్మాద్విరాడజాయత = మధోపురః । చంద్రాం ప్రభాసాం = త్వాంవృణె । వాలాగ్రసేతుబంధాయ శతానన వధాయచ । తుభ్యమాచమనం దత్తం ప్రతి గృహ్ణీ ష్వమారుతే । ఓం హ్రీం హారి = స్వాహా । శ్రీసువర్చలా = నమః ముఖే ఆచమనీయం సమర్పయామి ।-

(మధుపర్కం) యత్పురుషేణ హవిషా = ద్ధవిః ।
ఆదిత్యవర్ణే బాహ్య అలక్ష్మీః । ఋస్తవ ధ్వజసంవాసదశానన
మదాపహా । మధుపర్కం ప్రదాస్యామి హనుమన్ ప్రతి
గృహ్యతాం । ఓం హ్రీం హరి = స్వాహా । శ్రీసువర్చలా =
నమః । మధుపర్కం సమర్పయామి । స్నానం । సప్తాశ్యాస్ప
రిధయః = పురుషంపశుం । ఉపైతుమాం దేవ = దదాతుమె ।
గంగాది సర్వతీర్థేభ్యస్యమాన తైర్పవోదకైః । భవంతం
స్నాపయిష్యామి కపినాయక గృహ్యతాం । పంచామృత
స్నానం ఆప్యాయస్వసమేతుతే ఇత్యాది పంచామృత మంత్రైః
స్నాపయిత్వా । యాః ఫలినర్యేతి మంత్రేణ ఫలోదకం ।
ఆపోహిష్ఠేతి మంత్రేణ శుద్ధోదకం । శుద్ధోదక స్నానాంతరం ।
నమకచమక పురుషసూక్త మన్యుసూక్త హనుమత్సూక్తేనచ
అభిషేకం కుర్యాత్ ।—

ఓం హ్రీం హరి = స్వాహా । సువర్చలా సహిత ఆంజ
నేయస్వామినేనమః । స్నానం సమర్పయామి । స్నానానంత
రం శుద్ధాచమనీయం సమర్పయామి వస్త్రం । తం యజ్ఞం
బర్హిషి = ఋషశ్చయె । క్షుత్పిపాసా = గృహాత్ ।
పీతాంబరమిదం తుభ్యం తప్తహాటక సన్నిభం । దాస్యామి
వానరశ్రేష్ఠసంగృహాణనమోస్తుతే ఉత్తరీయ్యంతు దాస్యామి ।
సంసారోత్తారకారణ । గృహాణ పరమప్రీత్యానతోస్మితవ
పాదయోః ।

ఓం హ్రీం హరి = స్వాహా । శ్రీసువర్చలా = నమః ।
వస్త్రయుగ్మం సమర్పయామి వస్త్రం యుగ్మానంతర

శుద్ధాచమనీయం సమర్పయామి యజ్ఞోపవీతం। తస్మాద్య
జ్ఞాత్సర్వహుతః = గ్రామశ్చయె। యజ్ఞోపవీతం = బలమస్తు
తేజః। బ్రహ్మసూత్రమిదం భవ్యం ముక్తాదామోపశోభితం।
స్వీకురుష్వాంజనాపుత్ర భక్తరక్షణతత్పర। ఓం హ్రీం హరి =
స్వాహా। శ్రీసువర్చలా = నమః యజ్ఞోపవీతం సమర్పయామి।
భూషణం। భూషణాని మహార్హాణి రీట ప్రముఖాన్యహం
తుభ్యం దాస్యామి సర్వేశ గృహాణకపినాయక। ఓం హ్రీం
హరి = స్వాహా। శ్రీసువర్చలా = నమః। భూషణం సమర్ప
యామి। గంధం। తస్మాద్యజ్ఞా = అజాయత। గంధద్వారాం
న్శ్రియం కస్తూరీకుంకుమోన్మిశ్రం కర్పూరాగరువాసితం।
శ్రీచందనంతుదాస్యామి గృహ్యాతాం హనుమత్ప్రభో।
ఓం హ్రీం హరి = స్వాహా। శ్రీసువర్చలా = స్వామినేనమః
శ్రీగంధం సమర్పయామి। గంధస్యోపరి కుంకుమం సమర్ప
యామి। పుష్పం। తస్మాదశ్వా అజాయంత = అజావయః।
మనసః కామమాకూతిం = యశః। సుగంధీని సురూపాణి
వస్త్యాని వివిధానిచ। చంపకాదీని పుష్పాణి కమలాన్యుత్ప
లానిచ। తులసీదళనాదీనిమనసా కల్పితానితే। గృహాణహను
మన్దేవప్రణతోస్మిపదాంబుజే। శాలేయానక్షతాన్ రమ్యా
న్పద్మరాగసమప్రభాన్। అఖండాన్ ఖండితధ్వాంతాన్స్వీ
కురుష్వదయానిధే ఆవరణపూజా॥ (అధాంగపూజా) అష్టోత్తర
శత సహస్రనామపూజయా యథాశక్తిపూజాంచకృత్వా॥

సుగ్రీవమిత్రాయనమః పాదౌపూజయామి. అంగద।
మిత్రాయనమః। గుల్ఫౌపూజయామి రామదాసాయనమః

జంఘేపూజయామి । అక్షమారణాయనమః కటింపూజయామి॥ లంకారయేనమః వాలంపూజయామి లక్ష్మణీదప్రఘ్నాయనమః మధ్యంపూజయామి సంజీవాహర్త్రేనమః వళీఃపూజయామి। కుంతిత్రిదశశకంఠాయనమః । వృక్షః పూజయామి । రామాభిషేక కారిణేనమః కంఠంపూజయామి జితకామాయనమః హస్తౌపూజయామి ప్రసన్నవదనాయ నమః వక్త్రం పూజయామి । శ్రుతి పారగాయనమః నేత్రేపూజయామి । ఊర్ధ్వపుండ్ర ధారిణేనమః శ్రోత్రే పూజయామి । మణికంఠమాలినే నమః । లలాటంపూజయామి సర్వాభీష్టప్రదాయనమః ॥సర్వాణ్యంగాని పూజయామి। ఓం కేశవాయనమః । ఓం నారాయణాయనమః । ఇత్యాది - (అష్టోత్తరశతనామ సహస్రనామ యథాశక్తిపూజానంతరం) ఓం హ్రీం హరి = స్వాహా శ్రీ సువర్చలాసహిత = నమః నానా విధపరిమళపత్రపుష్పాణ్యక్షతానిచ సమర్పయామి_

ధూపం । యత్పురుషంవ్యదధుః= ఉచ్చైతేఃకదర్శైన= మాలినం కపిలాఘృతసంయుక్తః కృష్ణాగమసముద్భవః। మయాసమర్పితో ధూపో హనుమన్ప్రతిగృహ్యతాం । ఓం హ్రీం హరి = స్వాహా శ్రీసువర్చలా = నమః ధూపమాఘ్రాపయామి । దీపం । బ్రాహ్మణోస్య = అజాయత । అహ్నస్త జన్తు = మేకులే । నిరస్తాజ్ఞానతిమిర తేజోరాశేజగత్పతే। దీపం గృహాణదేవేశగోఘృతాక్తదశాన్వితం । ఓం హ్రీం హరి = స్వాహా । శ్రీసువర్చలా = నమః। దీపం దర్శ

యామి దూపదీపానంతరం శుద్ధాచమనీయం సమర్పయామి నైవేద్యం । చంద్రమామనసోజాతః = రజాయత, అర్ద్రాం పుష్కరిణీం = మమావహా । ఇదందివ్యాన్నమమృతం నూప శాకఫలాన్వితం । సాజ్యంసదధి క్షీరం శర్కరామధుసంయుతం భక్ష్యం భోజ్యంచలేహ్యంచచోష్యంచాపిచతుర్విధం గృహాణహనుమన్ భక్త్యాస్వర్ణపాత్రేనివేదితం । సమర్పయామి పానీయం మధ్యేమధ్యేసుధోపమం । సచ్చిదానందరూపాయ సృష్టిస్థిత్యంతహేతవే॥

ఓం భూర్భువస్సువః = ప్రచోదయాత్ । సత్యంత్వర్తేన పరిషించామి. అమృతమస్తు. అమృతోప స్తరణమసి, ఓం హ్రీంహరిమర్కట = స్వాహా శ్రీసువర్చలాసహిత = స్వామినే నమః మహానైవేద్యం సమర్పయామి, ఓంప్రాణాయస్వాహా = సమానయస్వాహా మధ్యేమధ్యే పానీయంసమర్పయామి అమృతాపిధానమసి । ఉత్తరాపోశనం సమర్పయామి । శుద్ధాచమనీయం సమర్పయామి తాంబూలం నాభ్యాఆసీదంతరిక్షం = అకల్పయన్ । ఆర్ద్రాంయః కరణీం = మమావహా । పూగీఫలైస్సమాయుక్తం కర్పూరాది సమన్వితం స్వర్ణవర్ణదళోపేతం తాంబూలం గృహ్యతాం హరే! ఓంహ్రీంహరిమర్కట స్వాహా । శ్రీసువర్చలా = నమః తాంబూలంసమర్పయామి, తాంబూలచర్వణానంతరంశుద్ధాచమనీయం సమర్పయామి-

నీరాజనం వేదాహమేతం = యథాస్తే । తాంమ ఆవాహా = పురుషానహం।నీరాజనమిదందివ్యంమంగళార్థం కపి

ప్రభోమయాసమర్పితంతాతగృహాణవరదోభవ సర్వ పక్షాం మే
ఓం హ్రీం గోపాయ = హరిమర్కట = స్వాహా । శ్రీ సువ
ర్చలా = నేనమః, కర్పూర ఆనందనీరాజనం దర్శయామి ।
నీరాజనానంతరం శుద్ధాచమనీయం సమర్పయామి । మంత్ర
పుష్పం । ధాతాపురస్తాద్యముదాజహార । అయనాయవిద్యతే ।
యశ్శుచిః = సతతంజపేత్ । మందారపారిజాతాది పుష్పాం
జలిమమంప్రభో । స్వర్ణ పుష్పసమాకీర్ణముష్టిధ్వజగృహాణవై
మర్కటేశమహోత్సాహసర్వశోక వినాశన । శత్రూన్ సం
హరమాం రక్షశ్రియందాపయమేప్రభో । ఓం హ్రీం హరి =
స్వాహా శ్రీసువర్చలాసహిత = స్వామినేనమః । సువర్ణ దివ్య
మంత్ర పుష్పం సమర్పయామి । ఈశానస్సర్వవిద్యానామీ
శ్వరస్సర్వ = సదాశివోం । ప్రదక్షిణనమస్కారాన్ సాష్టాం
గాన్ పంచసంఖ్యయా । దాస్యామికపిరాధాయగృహాణాభీష్ట
దాయక । ఓం హ్రీం హరిమర్కట = స్వాహా శ్రీ సువ
ర్చలా = స్వామినేనమః ఆత్మప్రదక్షిణనమస్కారాన్ సమర్ప
యామి॥ నృత్యం గీతంచవాద్యంచకృతంగంధర్వ సత్తమైః
ప్రకల్పయామి మనసా రామదూతాయతేనమః । రాజోప
చారైస్పతితం పురాణపఠనాదిభిః । సంతుష్టోభవసర్వాత్మన్
సర్వలింగమయాత్మక॥ ఓంహ్రీంహరిమర్కట=స్వాహా । శ్రీ
సువర్చలా = నమః । నృత్యం దర్శయామి । గీతం శ్రావ
యామి । ఆందోళికాధిరోహణంకల్పయామి సమస్త దేవోప
చార । రాజోపచార । భక్త్యుపచార శక్త్యుపచార పూజాం

సమర్పయామి । మైరావణ మహాప్రాజ్ఞ ప్రాణవాయుబిలే శయ । పునరర్ఘ్యం ప్రదాస్యామి పవనాత్మజగృహ్యతాం ।ఓం హ్రీం హరి = స్వాహా శ్రీసువర్చలా = నమః పునరర్ఘ్యం సమర్పయామి -

అథ పూజాంతే అర్ఘ్యదానం కర్తవ్యమ్. అర్ఘ్యదాన మంత్రాః॥ శ్లో॥ దశమ్యాం మందయుక్తాయాం కృష్ణాయాం మాసిమాధవే । పూర్వాభాద్రాఖ్యనక్షత్రే వైధృతౌ హనుమానభూత్॥ సువర్చలాసమేత శ్రీహనుమతేనమః ఇదమర్ఘ్యం సమర్పయామి॥ శ్లో॥ జాతఃకపికులాంభోధౌ స్వర్ణవర్ణ రం భావనా ప్రియః । భక్తసంరక్షణార్థాయ గృహాణార్ఘ్యం నమోఽస్తుతే॥ శ్రీసువర్చలా సమేతహనుమతే నమః ఇదమర్ఘ్యం సమర్పయామి॥ శ్లో॥ దుష్టానాం శిక్షణార్థాయ శిష్టానాం రక్షణాయ చ । రామకార్యార్థ సిద్ధ్యర్థం జాతశ్శ్రీహనుమాన్కపిః॥ శ్రీ సువర్చలాసమేతహనుమతే నమః ఇదమర్ఘ్యం సమర్పయామి॥ శ్లో॥ అంజనాగర్భసంభూత హనూమన్పవనాత్మజ । గృహాణార్ఘ్యం మయా దత్తం కపివర్య నమోఽస్తు తే॥ శ్రీ సువర్చలాసమేతహనుమతే నమః ఇదమర్ఘ్యం సమర్పయామి॥ శ్లో॥ పూర్వాభాద్రాకుంభరాశౌ మధ్యాహ్నే కర్కటాంశకే । కౌండిన్యవంశే సంజాతో హనుమానంజనోద్భవః॥ శ్రీసువర్చలాసమేత హనుమతే నమః ఇదమర్ఘ్యం సమర్ప

యామి॥ అని ప్రతిమంత్రమునకు జలమును ఆంజనేయుని ముందర విడువవలెను. ఈ అర్ఘ్యదానమంత్రములు ప్రతి పూజాంతమునను పఠించవలెను.

తృతీయభాగము సంపూర్ణము.



ఓమ్

శ్రీసువర్చలాసమేతహనుమతే నమః

శ్రీమహాగణాధిపతయే నమః

# హనుమద్వ్రత జయంతీప్రదక్షిణ కల్పము

## చతుర్థ భాగము

## హనుమత్ప్రదక్షిణకల్పము

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం। ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వవిఘ్నోపశాంతయే ॥ వాగీశాద్యాస్సుమనస స్సర్వార్థానాముపక్రమే । యం నత్వా కృతకృత్యాః స్స్యుస్తం నమామి గజాననమ్॥ కపీనాం కరాళాస్యం కరుణాకరవిగ్రహం । కామితార్థప్రదం దేవం కలయే వాయునందనమ్॥ హనూమతో దైవతనాయకస్య సంసేవకానాం శుభదాయకస్య । ప్రదక్షిణానాం విధిమత్ర వక్ష్యే పూర్వోక్తరీత్యా సుఖబోధనాయ॥

తా॥ సమస్తదేవతాశ్రేష్ఠుడై నమస్కరించేవారలకు సమస్తశుభములను ఇచ్చే ఆంజనేయమూర్తియొక్క పూర్వోక్త గ్రంథసమ్మతమైన ప్రదక్షిణవిధిని భక్తులందరకు తెలియుట కొరకు వ్రాయుచుంటిని.

## ప్రదక్షిణ క్రమం

పూజానంతరము గాని, పారాయణాంతరము గాని స్వామివారికి ఆత్మ ప్రదక్షిణ నమస్కారములు చేయవలయు నని అగస్త్యమహర్షి ఋషులతో... ..

శ్లో॥ ప్రదక్షిణ క్రమం వక్ష్యే శృణుధ్వం భూసురోత్తమాః ।
సర్వపాపహరం చైవ సర్వదాన ఫలప్రదం ।
సర్వరోగ ప్రశమనం చరే త్తస్మాత్ప్రదక్షిణం॥

తా॥ ప్రదక్షిణ క్రమమును జెప్పెదను. బ్రాహ్మణోత్తములారా ! వినుడు, ప్రదక్షిణము సర్వపాపహరము. సర్వదాన ఫలప్రదము. సర్వరోగ నివారణము కాన ప్రదక్షిణము నాచరింపవలెను.

శ్లో॥ ప్రచ్ఛిన త్తి భయం సర్వం దకారో మోక్షసిద్ధిదః!
క్షికారాత్ క్షీయతే రోగో ణకార శ్శ్రీప్రదాయకః
ప్రదక్షిణార్థం సంయోగా త్ప్రదిక్షిణ మితి స్మృతం॥

తా॥ ప్ర అనెడి అక్షరము సర్వభయములను నివారించును. దకారము మోక్షసిద్ధిని కలుగజేయును. క్షికారము సకలరోగములను క్షీణింపజేయును. ణకారము శ్రీని గలుగజేయును. ప్రదక్షిణార్థమై సంయోజనము చేయుటచే ప్రదక్షిణ మని చెప్పబడినది.

ప్రతిదినమును సాష్టాంగ నమస్కారములు అయిదు పర్యా యములు చేయవలయును,

## నమస్కారము చేయువపుడు

శ్లో॥ నమస్తే తు మహావీర నమస్తే వాయునందన ।
విలోక్య కృపయా నిత్యం త్రాహి మాం భక్తవత్సల ॥

అని నమస్కారము చేయువలయును.

అదౌ దీపం ప్రజ్వాల్య గణాధిపతిం ధ్యాత్వా తతః ఆచమ్య ప్రాణానాయమ్య దేశకాలౌ సంకీర్త్య శ్రీమాన్ గో...నా...స్య మమ సకుటుంబస్య సభ్రాతృకస్య సపుత్రకస్య ఆయుష్యాభివృద్ధ్యర్థ మితోధిక మహైశ్వర్యప్రాప్త్యర్థం సుగుణా నేక సుపుత్రావాప్త్యర్థం గృహపశుశిశువృద్ధసర్వజనావహిత దుష్టగ్రహనివారణార్థం భూమ్యంతరిక్షమహోత్పాతాదిదుర్ని మిత్తామృతదర్శన దుష్టాకృష్ట ప్రయోగోపద్రవ సకలక్షుద్ర ప్రయోగ శల్యతంత్రాదిప్రయోగ బగళాప్రయోగాఽఽసురీ ప్రయోగ వార్తాళీప్రయోగ నివారణార్థం బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రచండాలాదినానాజాతి స్త్రీపురుషదుష్ట గ్రహో చ్చాటనార్థం త్రయోదశసన్నిపాతాఽష్టాదశకుష్ఠ గుల్మాఽష్ట విధ మహాపక్షవాత పాండురోగ కామిలా క్షయ హృదయ శూలాఽక్షిశూల కుక్షిశూలాది సమస్తవ్యాధినివారణార్థం శ్రీసువర్చలాసమేతాంజనేయప్రసాదసిద్ధ్యర్థమాంజనేయప్రదక్షి ణాని కరిష్యే॥ ఇతి సంకల్ప్య దేవం షోడశోపచారైరభ్యర్చ్చ యేత్.

ఈ ప్రకారము సంకల్పమునుచేసి తరువాత ఇందు కన బరచు యంత్రమును పూజచేయవలెను.

అథ పూజా ప్రకారః.

పూర్వోక్తఏవంగుణవిశేషణవిశిష్టే శుభే శోభనే ముహూర్తే శ్రీమాన్ గో ... నామధేయోహాం శ్రీమతః గో... నామధేయస్య మమఉపాత్తదురితక్షయద్వారా శ్రీసువర్చలా సమేతాంజనేయప్రీత్యర్థ మావాహనాదిషోడశోపచారపూజాం కరిష్యే॥ తదంగకలశారాధనం కరిష్యే॥ కలశం గంధపుష్పాక్షతైరభ్యర్చ్య॥ శ్లో॥ కలశస్య ముఖే విష్ణుః కంఠే రుద్రస్సమాశ్రితః। మూలే తత్ర స్థితో బ్రహ్మ మధ్యే మాతృగణాః స్మృతాః॥ కుక్షౌ తు సాగరాస్సర్వే సప్తద్వీపా వసుంధరా। ఋగ్వేదోథ యజుర్వేద స్సామవేదో హ్యథర్వణః॥ అంగైశ్చ సహితాస్సర్వే కలశాంబుసమాశ్రితాః॥ ఆ కలశేషు ధావతి పవిత్రే పరిషిచ్యతే ఉక్థైర్యజ్ఞేషు వర్ధతే ఆపో వా ఇదగ్ సర్వం విశ్వా భూతాన్యాపః ప్రాణా వా ఆపః పశవ ఆపోన్నమాపోమృతమాపస్సమ్రాడాపో విరాడాప స్స్వరాడాపశ్ఛన్దాగ్స్యాపో జ్యోతీగ్ష్యాపో యజూగ్ష్యాప స్సత్య మాపస్సర్వా దేవతా ఆపో భూర్భువస్సువరాప ఓమ్॥ శ్లో॥ గంగే చ యమునే కృష్ణే గోదావరి సరస్వతి। నర్మదే సింధు కావేరి జలేస్మిన్ సన్నిధిం కురు॥

అని ఈప్రకారము కలశముపై హస్తమునుంచి అభిమంత్రణము చేయవలెను.



ఈ హనుమద్యంత్రమును బంగారు రేకుమీదగాని వెండి రేకుమీదగాని రాగిరేకుమీదగాని ధారణకు తగినట్లుగా చెక్కించి ప్రదక్షిణానంతరమున ధారణచేసుకొనిన చాల మంచిది. ధారణానంతరమున తమకు ఎంతవరకు అవసరమో అంతవరకు ప్రతిశనివారమును ఈ యంత్రమును శనివార నియమములో విధించినపద్ధతిని షోడశోపచారములచేత పూజింపుచుండవలెను. గృహమునందు ఈశాన్యభాగమున, గోమయముతో స్థలశుద్ధి చేసి శని ఉషఃకాలమున ప్రారంభము చేయవలెను.

కలశోదకేన దేవమాత్మానం యాగోపకరణాని సంప్రోక్ష్య ॥

కలశోదకముచే పూజాద్రవ్యములనున్ను దైవమునున్ను తనదేహమునకు మార్జన చేసుకొనవలెను. తరువాత ప్రాణ ప్రతిష్ఠాపన మంత్రముచే ప్రతిమకు ప్రాణముపోయవలెను.

## ప్రా ణ ప్ర తి ష్ఠా ప న మ్.

అసునీతే పునరస్మాసు చక్షుః పునః ప్రాణమిహా నో ధేహి భోగం జ్యోక్పశ్యేమ సూర్యముచ్చర న్తమనుమతేమృడ యానస్స్వస్తి । అమృతం వై ప్రాణా అమృతమాపః ప్రాణా నేవ యథాస్థానముపహ్వాయతే ॥ ఓమాం హ్రీం క్రోం యం రం లం వం శం షం సం హం ళం క్షం హంసస్సోహం ఆంజనేయ యంత్రప్రాణా ఇహ ప్రాణా ఆంజనేయయంత్రస్య సర్వేంద్రియాణి వాఙ్మనశ్చక్షుః శ్రోత్రజిహ్వాఘ్రాణానీ హైవా గత్య సుఖం చిరం తిష్ఠంతు స్వాహా। ఈప్రకారము ప్రాణ ప్రతిష్టాపనసమయమున మాత్రము ౩ పర్యాయములు, నిత్య పూజయందు, ఒకేపర్యాయము మంత్రమునుపఠింపుచు హస్త మును యంత్రమం దుంచవలెను.

శ్లో॥ అథ ధ్యాయేత్కపిశ్రేష్ఠం చతురావరణాన్వితం । వామభాగస్థితాం పత్నీం సూర్యపుత్రీం సువర్చలామ్॥ ప శ్యంతం స్నిగ్ధయా దృష్ట్యా స్మితవక్త్రముఖాంబుజం ఛత్రచా మర సంయుక్తం వినతాద్యైస్సుసేవితమ్॥ ముక్తాహార గణో

పీతం రత్నకుండలభూషితం। గ్రైవేయభూషితగ్రీవం కన కాంగదధారిణమ్॥ నానామణిసముత్కీర్ణం కిరీటోజ్జ్వల శేఖరం। మేఖలాదామసంవీతంమణినూపురశోభితమ్ రత్నకంకణవిద్యోతి పాణిరక్తాంబుజద్వయం । క్వథితస్వర్ణ వర్ణాంగముష్ట్రధ్వజసమ న్వితమ్॥ పద్మాసనే సమాసీనం పీతాంబరసమన్వితం । చతు ర్భుజధరం శాంతం సర్వవ్యాపిన మీశ్వరమ్॥ సర్వదేవపరీ వారం సర్వాభీష్ట ఫలప్రదమ్॥ ఆవాహయామి సర్వేశం సూర్య పుత్రీప్రియం విభుమ్ । అంజనాతనయం దేవంమాయాతీతం జగద్గురుం॥ ఏవం ధ్యాత్వా హనూమంతం పూజయే చ్ఛ్రద్ధ మానసః॥ శ్రీసువర్చలాసమేత శ్రీహనుమతే నమః ధ్యాయామి॥ ఆగచ్ఛ హనుమద్దేవ త్వం సువర్చలయా సహ। పూజా సమాప్తి పర్యన్తం భవ సన్నిహితోముఖః॥ శ్రీసువర్చలా సమేత శ్రీహనుమతేనమః ఆవాహయామి॥ భీమాగ్రజ మహా ప్రాజ్ఞ త్వం మమాభిముఖో భవ। సువర్చలాపతే శ్రీమన్ ప్రసీద జగతాంపతే। దేవదేవ జగన్నాథ కేసరిప్రియనన్దన। రత్నసింహాసనం తుభ్యం దాస్యామి హనుమత్ప్రభో॥ శ్రీ॥సు॥ నవరత్న ఖచితహేమసింహాసనం సమర్పయామి॥ యోగి ధ్యేయాంఘ్రి పద్మాయ జగతాం పతయే నమః । పాద్యం మయార్పితం దేవ గృహాణ పురుషోత్తమ॥ శ్రీ॥ సు॥ హ॥ నమః పాదయోః పాద్యం సమర్పయామి॥ లక్ష్మణప్రాణసంరక్ష సీతాశోకవినాశన । గృహాణార్ఘ్యం మయా దత్తం పార్వతీ ప్రియనందన॥ శ్రీ॥ సు॥ హ॥ నమః అర్ఘ్యం సమర్పయామి॥ వాలాగ్రసేతుబంధాయ శతాననవధాయ చ । తుభ్యమాచ

మనం దత్తం ప్రతిగృహ్ణీష్వ మారుతే॥ శ్రీ॥సు॥హ॥ నమః ఆచమనీయం సమర్పయామి॥ అస్తవస్త్వజసంవాస దశానన మదాపహ । మధుపర్కం ప్రదాస్యామి హనుమన్ప్రతి గృహ్యతామ్॥ శ్రీ॥సు॥హ॥ నమః మధుపర్కం సమర్పయామి॥ గంగాదిసర్వతీర్థేభ్యస్సమానీతైశ్శుభోదకైః। భగవంతం స్నాప యిష్యామి కపినాయక గృహ్యతామ్॥ శ్రీ॥సు॥హ॥ నమః స్నానం సమర్పయామి॥ పీతాంబర మిదం తుభ్యం తప్త హాటక సన్నిభం । దాస్యామి వానరశ్రేష్ఠ సంగృహాణ నమోస్తు తే॥ శ్రీ॥సు॥హ॥ నమః॥ వస్త్రయుగ్మం సమర్ప యామి॥ బ్రహ్మసూత్రమిదం దివ్యం ముక్తాదామోపశోభితం। స్వీకురుష్వాంజనాపుత్ర భక్తరక్షణతత్పర॥ శ్రీ॥సు॥హ॥ నమః యజ్ఞోపవీతం సమర్పయామి॥ ఉత్తరీయం తు దాస్యామి సంసారోత్తారకారణ । గృహాణ పరమప్రీత్యానతోస్మి తవ పాదయోః॥ శ్రీ॥సు॥హ॥ నమః ఉత్తరీయం సమర్పయామి॥ భూషణాని మహార్హాణి కిరీటప్రముఖాన్యహం । తుభ్యం దాస్యామిసర్వేశ గృహాణ కపినాయక॥ శ్రీ॥సు॥హ॥ నమః ఆభరణాని సమర్పయామి॥ కస్తూరీకుంకుమోన్మిశ్రం కర్పూరా గురువాసితం । శ్రీచందనం తు దాస్యామి గృహ్యతాం హను మన్ప్రభో । శ్రీ॥ సు॥ హ॥ నమః॥ దివ్యశ్రీచందనం సమర్ప యామి॥ సుగంధీని సురూపాణి వన్యాని వివిధాని చ । చంప కాదీని పుష్పాణి కమలాన్యుత్పలాని చ ॥ తులసీదళ బిల్వాని మనసా కల్పితాని తే । గృహాణ హనుమన్దేవ ప్రణతోస్మి పదాంబుజే॥ శ్రీ॥ సు॥ హ॥ నమః॥ పుష్పా॥ స...మి॥ శాఖ

యానక్షతాన్ సమర్ప్యాన్విద్మ రాగ సమప్రభాన్ । అఖండా న్ఖండిత ధ్వాంత స్వీకురుష్వ దయానిధే ॥ శ్రీ॥ సు॥ హ॥ నమః అక్షతాన్ సమర్పయామి॥

## అథాంగ పూజా.

మారుతయే నమః పాదౌ పూజయామి । సుగ్రీవ సఖాయ నమః గుల్ఫౌ పూజయామి । అంగదమిత్రాయ నమః జంఘే పూజయామి । రామదాసాయ నమః ఊరూ పూజయామి । అక్షఘ్నాయ నమః కటిం పూజయామి । లంకాదహనాయ నమః వాలం పూజయామి । రామమణిదాయ నమః నాభిం పూజయామి । సాగరోల్లంఘనాయ నమః మధ్యం పూజయామి। లంకామర్దనాయ నమః వళిత్రయం పూజయామి । సంజీవినీహర్త్రే నమః స్తనౌ పూజయామి । సౌమిత్రిప్రాణదాయ నమః వక్షఃస్థలం పూజయామి । కుంఠితదశకంఠాయ నమః కంఠం పూజయామి । రామాభిషేకకారిణే నమః హస్తౌ పూజయామి । మంత్రరచితరామాయణాయ నమః వక్త్రం పూజయామి । ప్రసన్నవదనాయ నమః వదనం పూజయామి । పింగనేత్రాయ నమః నేత్రే పూజయామి । శ్రుతిపారాయణాయ నమః శ్రోత్రే పూజయామి । ఊర్ధ్వపుండ్రధారిణేనమః కపోలం పూజయామి। మణికంఠమాలినే నమః శిరః పూజయామి సర్వాభీష్టప్రదాయనమః సర్వాంగాణి పూజయామి॥

# అథాష్టోత్తరశతనామపూజా.

ఓం ఆంజనేయాయ నమః
కేసరిప్రియనందనాయ
వాయుకుమారాయ
అసహాయాయ
ఈశ్వరపుత్రాయ
పార్వతీగర్భసంభూతాయ
వానరనాయకాయ
సకలవేదశాస్త్రపారగాయ
సంజీవిపర్వతోత్పాటనాయ
లక్ష్మణప్రాణరక్షకాయ
భీమప్రాణరక్షకాయ
సీతాదుఃఖనివారణాయ
దుర్దండిబంధమోచనాయ
నీలమేఘరాజ్యదాయకాయ
సుగ్రీవరాజ్యకారణాయ
భీమసేనాగ్రజాయ
ధనంజయధ్వజవాహనాయ
కాలనేమిసంహారకాయ
మైరావణమర్దనాయ
వృత్రాసురభంజనాయ
సప్తమంత్రిసుతధ్వంసనాయ
ఇంద్రజిద్వధకారణాయ
అక్షకుమారసంహారకాయ
లంకిణీభంజనాయ
రావణమర్దనాయ ౨౫
కుంభకర్ణవధపరాయణాయ
ఓం జంబుమాలినిషూదనాయ
ఏకపిరాయ నమః
రాక్షసకులదహనాయ
అశోకవనవిదారణాయ
లంకాదహనాయ
శతముఖవధకారణాయ
సప్తసాగరవాలాయ
సేతుబంధనవాలాయ
నిరాహారాయ
నిర్గుణాయ
సగుణస్వరూపాయ
హేమవర్ణాయ
పీతాంబరధరాయ
సువర్చలాప్రాణనాయకాయ
త్రయస్త్రింశత్కోట్యర్బుద రుద్రగణపోషకాయ
భక్తపాలనచతురాయ
నవకనకకుండలాభరణాయ
రత్నకిరీటహారనూపురశోభికాయ
శ్రీరామభక్తితత్పరాయ
హేమరంభావనవిహారాయ

వజ్రకుశాంకితాయ
మేఘవాహనాయ
నీలమేఘశ్యామాయ
సూక్ష్మకాయాయ
మహాకాయాయ
బాలసూర్యగ్రసనాయ
ఋశ్యమూకగిరినివాసకాయ
మేరుపీఠార్చనాయ
ద్వాత్రింశదాయుధధరాయ
చిత్రవర్ణాయ
విచిత్రసృష్టినిర్మాణకర్త్రే
అనంతనామ్నే
దశావతారాయ
అఘటనాఘటనసమర్థాయ
అనేకబ్రహ్మాండనాయకాయ
దుర్జనసంహారకాయ
సజ్జనసంరక్షకాయ
దేవేంద్రవందితాయ
సకలలోకారాధ్యాయ
సత్యసంకల్పాయ
భక్తసంకల్పపూరకాయ
అతిసుకుమారదేహాయ
యక్షకర్దమవిలేపాయ
కోటిమన్మథాకారాయ
ఓం రణకేళీమర్దనాయనమః
విజృంభమాణాయ

సకలలోకకుక్షింభరాయ
సప్తమహామంత్రతంత్రస్వరూపాయ
భూతప్రేతపిశాచశాకినీ డాకినీ విధ్వంసనాయ ౭౫
శివలింగప్రతిష్ఠాపనకారణాయ
దుష్కర్మవిమోచనాయ
దౌర్భాగ్యనాశనాయ
జ్వరాదిసకలరోగనివారణాయ
భుక్తిముక్తిదాయకాయ
కపటనాటకసూత్రధారిణే
లీలావినోదాయ
అగణితకల్యాణపరిపూర్ణాయ
మంగళప్రదాయ
గానలోలాయ
గానప్రియాయ
అష్టాంగయోగనిపుణాయ
సకలవిద్యాపారీణాయ
ఆదిమధ్యాంతరహితాయ
యజ్ఞకర్త్రే
యజ్ఞభోక్త్రే
మన్మథవైభవానుభూతిచతురాయ
సకలలోకాతీతాయ
విశ్వంభరాయ
విశ్వమూర్తయే

విశ్వాకారాయ
దయాస్వరూపాయ
దాసజనహృదయకమలవిహారాయ
మనోవేగినే
మనోభావజ్ఞనిపుణాయ ౧౦౦
ఋషిగణగేయాయ
భక్తజనమనోరథదాయకాయ
భక్తరక్షకాయ
దీనపోషకాయ
దీనమందారాయ
సర్వస్వతంత్రాయ
శరణాగతరక్షకాయ
ఆర్తత్రాణపరాయణాయ ౧౦౮

శ్రీసువర్చలాసమేతహనుమతే నమః నానావిధ పరిమళ పత్రపుష్పాక్షతాన్ సమర్పయామి ॥ శక్తశ్చేత్సహస్రనామభి పూజయేత్ ॥ (శక్తికలిగినవారు సహస్రనామములచేత పూజ చేయవచ్చును) కపిలాఘృతసంయుక్తః కృష్ణాగురుసముద్భవః । మయాసమర్పితో ధూపో హనుమన్ప్రతిగృహ్యతామ్॥ శ్రీ॥ సు॥ హ॥ ధూపం॥ నిరస్తాజ్ఞానతిమిర తేజోరాశే జగత్పతే । దీపం గృహాణ దేవేశ గోఘృతాక్తం దశాన్వితమ్ ॥ శ్రీ॥ సు॥ హ॥ దీపం॥ ఇదం దివ్యాన్నమమృతం సూపశాకఫలాన్వితం । సాజ్యం సదధి సక్షీరం శర్కరామధుసంయుతమ్ ॥ భక్ష్యం భోజ్యం చ లేహ్యం చ చోష్యం చాఽపి చతుర్విధం । గృహాణ హనుమన్భక్త్యా స్వర్ణపాత్రే నివేదితమ్ ॥ । శ్రీ॥ సు॥ హ॥ మహానై ॥ మి॥ సమర్పయామి పానీయం మధ్యే మధ్యే సుధోపమం । సచ్చిదానందరూపాయ సృష్టిస్థిత్యంతహేతవే॥ శ్రీ॥ సు॥ హనుమతే నమః మధ్యే మధ్యే॥ పా ॥మి॥ పూగీఫలై స్సమాయుక్తం కర్పూరాది సమన్వితం । స్వర్ణవర్ణదళోపేతం

తాంబూలం గృహ్యాతాం హరే॥ శ్రీ॥సు॥హ॥ తాం॥ మి॥ నీరాజనమిదం దివ్యం మంగళార్థం కపిప్రభో । మయా సమ ర్పితం తాత గృహాణ వరదోభవ॥ శ్రీ॥ సు॥ నమః॥ నీ॥ మి॥ నృత్యం గీతం చ వాద్యం చ కృతం గంధర్వసత్తమైః । ప్రకల్పయామి మనసా రామదూతాయ తే నమః॥ శ్రీ॥సు॥హ॥ నృత్యగీత వాద్యాని సమర్పయామి॥ రాజోపచారైస్సతతం పురాణపఠనాదిభిః । సంతుష్టోభవ సర్వాత్మన్ సర్వలింగ మయాత్మక॥ శ్రీ॥ సు॥ హ॥ నమః రాజోపచారాన్దేవోప చారాన్త్సమర్పయామి॥ మైరావణమహా దైత్యప్రాణవాయు బిలేశయ । పునరర్ఘ్యం ప్రదాస్యామి పవనాత్మజ గృహ్యా తామ్॥ శ్రీ॥ సు॥ హ॥ పునరఘర్ఘ్యం సమర్పయామి॥ మందార పారిజాతాది పుష్పాంజలిమిమం ప్రభో । స్వర్ణపుష్పసమాకీర్ణ ముష్టిధ్వజ గృహాణ వై॥ శ్రీ॥ సు॥ హ॥ పుష్పాంజలిం సమర్ప యామి॥ ప్రదక్షిణనమస్కారాన్త్సాష్టాంగా న్పంచసంఖ్యయా। దాస్యామి కపినాథాయ గృహాణాఽభీష్టదాయక॥ శ్రీ॥ సు॥ ప్రదక్షిణనమస్కారాన్త్సమర్పయామి (ప్రదక్షిణనమస్కా రములు అయిదుచేయవలయును.) అశక్తులగువారు, రోగ గ్రస్తులు యథాశక్తి కేశవనామములతో పూజించవలెను.

అస్య శ్రీహనుత్కవచస్తోత్రమహామంత్రస్య రామచం ద్రో భగవానృషిః అనుష్టుప్ ఛందః హనుమాన్దేవతా మారు తాత్మజ ఇతి బీజమ్ అంజనాసూనురితి శక్తిః వాయుపుత్ర సితి కీలకమ్ సమస్తపాపక్షయార్థం శీఘ్రమేవ ఆయురారోగ్య

సిద్ధ్యర్థం హనుమత్కవచస్తోత్రపారాయణే వినియోగః. అంజనానూనవే అంగుష్ఠాభ్యాం నమః రుద్రావతారాయ తర్జనీభ్యాం నమః వాయుపుత్రాయ మధ్యమాభ్యాం నమః అగ్నిగర్భాయ అనామికాభ్యాం నమః రామదూతాయ కనిష్ఠికాభ్యాం నమః బ్రహ్మాస్త్రనివారణాయ కరతలకరపృష్ఠాభ్యాం నమః అంజనానూనవే హృదయాయ నమః రుద్రావతారాయ శిరసే స్వాహా వాయుపుత్రాయ శిఖాయై వషట్ అగ్నిగర్భాయ కవచాయ హుమ్ శ్రీరామదూతాయ నేత్రత్రయాయ వౌషట్ బ్రహ్మాస్త్రనివారణాయ అస్త్రాయ ఫట్. భూర్భువస్సువరోమితి దిగ్బంధః. ధ్యానమ్. వామే కరే వైరిభిదం వహంతం శైలం వరే శృంఖలహారటంకం, దధాన మచ్ఛాచ్ఛసువర్ణవర్ణం భజే జ్వలత్కుండల మాంజనేయమ్. ౧ ధ్యాయేద్బాలదివాకరద్యుతినిభం దేవారిదర్పావహం దేవేంద్రప్రముఖప్రశస్తయశసం దేదీప్యమానం రుచా, సుగ్రీవాదిసమస్తవానరయుతం సువ్యక్త తత్త్వప్రియం సంరక్తారుణలోచనం పవనజం పీతాంబరాలంకృతమ్. ౨. బుద్ధిర్బలం యశో ధైర్యం నిర్భయత్వ మరోగతా। అజాడ్యం వాక్పటుత్వం చ హనూమత్స్మరణా ద్భవేత్. ఉద్యన్మార్తాండకోటి ప్రకటరుచియుతం చారువీరాసనస్థం మౌంజీ యజ్ఞోపవీతాభరణమురుశిఖాశోభితంకుండలాక్తం, భక్తానామిష్ట కామప్రదమనుదినం వేదనాదప్రమోదం ధ్యాయే ద్దేవం విధేయం ప్లవగకులపతిం గోష్పదీభూతవార్ధిమ్. ౪. వామం భూతబలప్రభంజనయుతం కట్యాం నివేశ్య స్థితం భాహ్వాం

దక్షిణహస్తపద్మ మభయం ప్రద్యుమ్నరక్తప్రభం, రోమే నే మశకానివామకరిపుర్లానంకాపురీ సంస్థితాం స్తం వందే రఘునాథ నాథచరణ శ్రీపద్మభృంగం హరిమ్. ౫.

ఓమ్. హనుమా న్పూర్వతః పాతు దక్షిణేపవనాత్మజః। పాతు ప్రతీచ్యామక్షఘ్నః పాతు సాగరతారకః॥ ఉదీచ్యా మూర్ధ్వతః పాతు కేసరిప్రియనందనః। అధస్తా ద్విష్ణుభక్తస్తు పాతు మధ్యం చ పావనిః॥ లంకావిదాహకః పాతు సర్వా పద్భ్యో నిరంతరం। సుగ్రీవసచివః పాతు మస్తకం వాయు నందనః॥ ఫాలం పాతు మహాతేజా భ్రూమధ్యేచ నిరంతరం। నేత్రే ఛాయాపహారీ చ పాతు నః ప్లవగేశ్వరః॥ కపోలే కర్ణ మూలే తు పాతు శ్రీరామకింకరః। నాసాగ్రమంజనాసూనుః పాతు వక్త్రం హరీశ్వరః॥ పాతు కంఠం చ దైత్యారిః స్కంధౌ పాతుసురార్చితః। భుజౌ పాతు మహావీరః కరౌ చ చరణాయుధః॥ నఖా న్నఖాయుధః పాతు కుక్షిం పాతు కపీశ్వరః। వక్షో ముద్రాపహారీ చ పాతు పార్శ్వే భుజా యుధః॥ సీతాశోకాపహారీ చ స్తనౌ పాతు కపికుంజరః॥ నాభిం తు రామదూతస్తు కటిం పాత్వ నిలాత్మజః॥ లంకిణీభంజనః పాతు పృష్ఠదేశే నిరంతరం। గుహ్యం పాతు మహాప్రాజ్ఞో మేఢ్రం పాతు శివప్రియః॥ ఊరూ చ జానునీ పాతు లంకా ప్రాసాదభంజనః। జంఘే పాతు కపిశ్రేష్ఠో గుల్ఫౌ పాతు మహాబలః॥ అచలోద్ధారకః పాతు పాదౌ భాస్కర సన్నిభః। అంగాన్యమితసత్వాఢ్యః పాతు పాదాంగుళీస్సదా॥ సర్వాం

గాణి మహాశూరః పాతు రోమాణి మాత్మవాన్ । హనూ
మత్కవచం యస్తు పఠేద్విద్వాన్ విచక్షణః । స ఏవ పురుష
శ్రేష్ఠో భుక్తిం ముక్తిం చ విందతి । త్రికాలమేకకాలం వా
జపేన్మాసత్రయం నరః ॥ సర్వాన్రిపూన్క్షణే జిత్వా స పుమా
న్ శ్రియమాప్నుయాత్ । అర్ధరాత్రే జలే స్థిత్వా సప్తవారం
పఠేద్యది ॥ క్షయాపస్మారకుష్ఠాదితాపజ్వరనివారణమ్ । అశ్వత్థ
మూలేఽర్కవారే స్థిత్వా పఠతి యః పుమాన్ । స పుమాన్ శ్రి
యమాప్నోతి సంగ్రామేషు జలాంతరే । యః పఠేద్ధారయే
ద్వా త్తస్య శరస్థాస్సర్వసిద్ధయః । లిఖిత్వా పూజయేద్యస్తు సర్వత్ర
విజయీ భవేత్ ॥ యో వారాన్నిధిమల్పపల్వలమివోల్లంఘ్య
ప్రతాపాన్వితో వైదేహీఘనశోకతాపహరణో వైకుంఠ
భక్తప్రియః । అక్షాద్యూర్జితరాక్షసేశ్వరమహాదర్పాపహారీ రణే
సోఽయం వానరపుంగవోఽవతు సదా త్వస్మాన్సమీరా
త్మజః ॥౧॥ యత్ర యత్ర రఘునాథకీర్తనం తత్ర తత్ర కృత
మస్తకాంజలిం । బాష్పవారిపరిపూర్ణలోచనం భావయామి
పవమాననందనమ్ ॥ ౨ । మండలీకృత వాలాగ్రం స్వర్ణవర్ణం
మహాహనుం । కుండలాలంకృతం శూరం భజే వాయుసుతం
హృది ॥ ౩॥ అమలకనకవర్ణం ప్రజ్వలత్పావకాక్షం సరసిజనిభ
వక్త్రం సర్వదా సుప్రసన్నం । పటుతరఘనగాత్రం కుండలా
లంకృతాంగం రణచలకరవాలం రామదూతం నమామి ॥ ౪ ॥
మనోజవం మారుతతుల్యవేగం జితేంద్రియం బుద్ధిమతాం
వరిష్ఠం । వాతాత్మజం వానరయూథముఖ్యం శ్రీరామదూతం
శిరసా నమామి ॥౫॥ దివ్యామథప్రదానేన కపికోటీరనేకశః ।

హనూమతే జీవయతే నమ స్తస్మై మహాత్మనే॥౬॥ ఆంజనేయ మతిపాటలాననం కాంచనాద్రికమనీయవిగ్రహం। పారిజాత తరుమూలవాసినం భావయామి పవమాననందనమ్ ॥౭॥ రాజ్య ప్రదం హనూమంతం వదాన్యం మధురప్రియం॥ శ్రుతిచింతా మణిం కామధేనుం కల్పక మాశ్రయే ॥౮॥ పద్మరాగమణి కుండలత్విషా పాటలీకృతకపోలమండలం। దివ్యహేమకదళీ వనాంతరే భావయామి పవమాననందనమ్ ॥ ౯ ॥ అంజనావర పుత్రాయ రామేష్టాయ హనూమతే। సర్వలోకైక వీరాయ భవిష్యద్బ్రహ్మణే నమః ॥౧౦॥ హనూమా నంజనాసూను ర్వాయుపుత్రో మహాబలః। రామేష్టః ఫల్గునసఖః పింగాక్షో ఽమితవిక్రమః॥ ఉదధిక్రమణశ్చైవ సీతాశోకవినాశకృత్ ॥ లక్ష్మణప్రాణదాతాచ దశగ్రీవస్య దర్పహా॥ ఏతద్ద్వాదశనా మాని కపీంద్రస్య మహాత్మనః। స్వాపకాలే పఠేన్నిత్యం యాత్రా కాలే విశేషతః। భయాని తస్య నశ్యంతిసర్వత్ర విజయీభ వేత్ ॥ ఇతి శ్రీహనుమత్కవచస్తోత్రమ్ ॥

ఇదం కవచపారాయణం కృత్వా ప్రదక్షిణానికుర్యాత్॥ ఈ కవచమును పఠించి ఈక్రింది మూడుమంత్రములతో ప్రద క్షిణము చేయవలెను.

## కష్టములోనున్నవారు

మర్కటేశ మహోత్సాహ సర్వశోకవినాశన॥ శత్రూ న్సంహర మాం రక్ష శ్రియం దాపయ మే ప్రభో॥ ఏతపఠంతః హస్తేన ఫలపుష్పాదికమాదాయ గణానాం కుర్వంతః అష్ట

త్తర శతసంఖ్యాకాని వా తదర్ధంవా తదర్ధం వా యథాశక్తి ప్రదక్షిణాని కుర్యుః॥ మయాకృతైరేభిః ప్రదక్షిణైః శ్రీసువర్చలాసమేత హనూమాన్సు ప్రీతస్సుప్రసన్నో వరదో భూత్వా మమాభీష్టసిద్ధిం దదాతు ఇతి జలం విసృజేత్ ॥ స్వయంవా కుర్యుః అశక్తాశ్చేదన్యైర్వా కారయేయురితి విధిః॥ ఏవం పంచచత్వారింశద్దినేషు వా ఏకపంచశదినేషు వా కామనాపూర్తయే కుర్వంతి చేత్తత్కామనాసిద్ధిః॥ అభీష్టం ప్రబలం చేద్బహుదినేషు కార్యమ్, అల్పం చేత్ అల్పదినేషు ఇతి పూర్వాచారపద్ధతి.

తా॥ 'మర్కటేశ' అనేమంత్రమును పఠించుచూ ఒక ప్రదక్షిణము చేయవలెను. ఈప్రకారము హస్తమునందు ఫలమును పుష్పములను వుంచుకొని అష్టోత్తరశతము (౧౦౮) ను నిత్యముచేయవలెను. అథవా ౫౪ గాని ౨౭ గాని శక్తికొలది చేయవలెను. శక్తిలేనివారు ఇతరులచే చేయించవలెను ఈప్రకారము ౪౦ దినములుగాని ౨౦ దినములుగాని దృఢభక్తితో చేయువారికి హనుమదనుగ్రహముచే కోరికలు సిద్ధించును,

వివిధ కోరికలు గలవారు తమ కోరికను మంత్రమందు సంకల్పించి ప్రదక్షిణములు చేయవలెను

కొన్ని ముఖ్యమయిన విషయములను ఈక్రింద వుదహరించుచున్నాను. శత్రువులచే బాధపడువారు ఈక్రింది మంత్రమును యథాశక్తి జపించుచూ యంత్రమునకు ప్రదిక్షణము చేయవలెను.

మర్కటేశ మహోత్సాహ సర్వశత్రు నివారక ।
శత్రూన్ సంహార మాంరక్ష శ్రియందాపయమే ప్రభో॥
అని చెప్పుచూ ప్రదక్షిణములు చేయాలి.

రోగ గ్ర స్తు లు

మర్కటేశ మహోత్సాహ సర్వరోగనివారణ ।
శత్రూన్ సంహారమాం రక్షశ్రియం దాపయమే ప్రభో॥
అని పై విధంగా జపించుచూ ప్రదక్షిణము చేయాలి.

సం తా నా ర్థు లు

అంజనాసుత దేవేశ కేసరి ప్రియనందన ।
దేహిమే తనయం శీఘ్రం సర్వభాగ్య నిధింప్రభో ॥

ఈవిధంగా 108 పర్యాయములు ప్రదక్షిణము చేసి ఈగ్రంథములోని హనుమజ్జన్మకథను చదువుకోవాలి, శని వార నియమము పాటించాలి.

## సంతాన హనుమన్మంత్రః

శ్రీ పరాశరః ॥ అన్యవిశేషం వక్ష్యామి లోకానాముప కారకం సంతానహనుమన్మంత్రం శృణుష్వ మునిపుంగవ । యస్య శ్రవణమాత్రేణ సంతానం ప్రాప్నుయాద్బహు। సారా త్సారతమం మంత్రం మంగళానాంచ మంగళం । మంత్రేణా నేన సవసాబహావసిద్ధిమాప్నుయుః । సర్వసౌభాగ్య జనకం । మంత్రాణా ముత్తమోత్తమం । అస్యశ్రీ సంతాన హనుమ న్మంత్రస్య బ్రహ్మఋషిః । గాయత్రీ ఛందః । శ్రీ సంతాన

హనుమాన్దేవతా॥ ఓం బీజం । స్వాహాశక్తిః। శ్రీ కీలకం మమ సంతాన హనుమత్ప్రసాద సిద్ధ్యర్థే జపే వినియోగః। మూలేన న్యాసం కుర్యాత్ ॥ ధ్యానం ॥ అంజనాసుత దేవేశ కేసరి ప్రియనందన । దేహిమేతనయం శీఘ్రం సర్వభాగ్యనిధింప్రభో॥ గ్రంథాంతరే ॥ ప్రాలేయద్యుతి బింబకోటి రుచిర ప్రస్పర్ధి దేహ ప్రభం । భాస్వద్రత్న కిరీట కుండలమణిం । వ్యాకీర్ణగండస్థలం వామేవ్యాధిభి రాపకం । నిగళ భిల్లంకం కరేదక్షిణే । బిభ్రాణం హనుమంత ముజ్వల తటిత్కోటి ప్రభం। సంశ్రయే। పురశ్చర్యా క్రమంవక్ష్యే పంచలక్షం ద్విజోత్తమ। నారికేళో దకంవాపి । గోక్షీరేణ విశేషతః । గుడోదకం వా యోగీంద్ర దశాంశం తర్పణంబుధః । తద్దశాంశం హునేద్విద్వాన్ సదా జప పరాయణః॥ ఖర్జూరఫల సంయుక్తం ఇక్షుఖండ మధు ప్లుతం । పుత్రజీవాఖ్య బీజాని ఘృతశర్కర సంయుతం। పర మాన్నంచ విప్రేంద్రీ హోమం కుర్యాద్వి చక్షణః । బ్రాహ్మ ణాన్ భోజయెత్పశ్చాత్ । తద్దశాంశం క్రమేణ వై పుత్రజీవ్య క్షమాలాభః । జపంకుర్యాచ్చ బుద్ధిమాన్ । ఏవంయః కురుతే యోగీ సంతానం ప్రాప్నుయాద్ధ్రువం ।

సంతాన హనుమన్మంత్రః

అస్యశ్రీ సంతాన హనుమన్మంత్రస్య । బ్రహ్మఋషిః । గాయత్రీఛందః । శ్రీ సంతాన హనుమదేవతా । ఓం బీజం । స్వాహాశక్తిః । శ్రీంకీలకం । మమ సంతాన హనుమత్ప్రసాద సిద్ధ్యర్థే జపే వినియోగః ।

ఓం శ్రీం హ్రీం క్లీం సంతానహనుమన్ మమ పుత్రం దేహిదేహిస్వాహా। ఇతి మూలమంత్రః। మూలమంత్రేణ అంగన్యాస, హృదయాది న్యాసాన్ కుర్యాత్ ।

ధ్యానం॥

అంజనాసుత దేవేశ కేసరీ ప్రియనందన।
దెహిమే తనయం శీఘ్రం సర్వభాగ్య నిధింప్రభో ॥

మూలమంత్రము సంపుటీకరణచేసి పారాయణ చేయవలెను. పై మంత్రమును యథాశక్తి జపించవలెను, పైన చెప్పిన విధముగా అనుసరించినవారికి సంతాన హనుమంతుడు సంతానవంతులను చేయును. ఎట్టి సందియమును లేదు.

ఆ ప్త బం ధు స మా గ మ ము న కు

శ్లో॥ విశ్లిష్టబంధుసంయోగ। కామనా చే ద్ధనూమతః ।
రామాంగులీయార్పణంతు । సీతాయై సంధ్యయోః
పఠేత్ ॥

ఆదావంతేపివా నిత్యం పనసామ్ర ఫలార్పణమ్ ॥

శ్లో॥ మర్కటేశ మహోత్సాహ సర్వశోకనివారక ।
శత్రూన్ సంహారమాం రక్షశ్రియందాపయమే ప్రభో ॥

అని చదువుచూ ప్రదక్షిణములు.పూర్తిచేసి ఈక్రిందివిధముగా చేయాలి.

తా॥ భార్యాభర్తలుగాని, సోదరులుగాని, యేమిత్రులు శత్రులుగా మారినను, దేశాంతరములయందున్నవారలు

తిరిగి ఒకచో జేయుటకును శ్రీరామముద్రికను హనుమంతుడు సీతకు యిచ్చిన స౦॥ ౩౬ వ సర్గను త్రికాలములయందు పఠించి, పఠనకుముందు, అనంతరము పనసఫలములుగాని, మామిడి ఫలములుగాని నివేదించవలెను. అట్లు సంప్రాప్తము కానిచో సంప్రాప్తమగు ఫలములు నివేదించ వచ్చును. వివాహము కోరువారు కూడా పై విధంగా చేయాలి. ఏకామ్యము గలవారు ఆకోరిక ప్రకారము ప్రదక్షిణ మంత్రము చెప్పి సుందరకాండలోని ౩౬ వ సర్గను పారాయణ చేయాలి. ప్రదక్షిణకాలములో నియమము కలవారై తారా బలము చంద్రబలము చూసుకుని ప్రారంభించాలి.

## శ్రీమత్సుందరకాండే షట్త్రింశ స్సర్గః

శ్లో॥ భూయఏవ మహాతేజా హనుమా న్మారుతాత్మజః ।
అబ్రవీ త్ప్రశ్రితం వాక్యం సీతా ప్రత్యయకారణాత్ ॥

వానరోఽహం మహాభాగే దూతో రామస్య ధీమతః ।
రామనామాంకితం చేదం పశ్య దేవ్యంగుళీయకమ్ ॥

ప్రత్యయార్థం తవాఽఽనీతం తేన దత్తం మహాత్మనా ।
సమాశ్వసిహి భద్రం తే క్షీణదుఃఖఫలా హ్యసి ॥

[ఇత్యుక్త్వా ప్రదదౌ తస్యై సీతాయై వానరోత్తమః]
గృహీత్వా ప్రేక్షమాణా సా భర్తుః కరవిభూషణం ।
భర్తారమివ సంప్రాప్తా జానకీ ముదితాఽభవత్ ॥

చారు తద్వదనం తస్యా స్తామ్రశుక్లాయ తేక్షణం ।
అశోభత విశాలాక్ష్యా రాహుముక్త ఇవోడురాట్ ॥

తత స్సా హ్రీమతీ బాలా భర్తృసందేశహర్షితా ।
పరితుష్టా ప్రియం కృత్వా ప్రశశంస మహాకపిమ్ ॥

శ్లో॥ విక్రాంత స్త్వం సమర్థ స్త్వం ప్రాజ్ఞ స్త్వం వానరోత్తమ ।
యే నేదం రాక్షసపదం త్వయైకేన ప్రధర్షితమ్ ॥

శతయోజనవిస్తీర్ణ స్సాగరో మకరాలయః ।
విక్రమ శ్లాఘనీయేన క్రమతా గోష్పదీకృతః ॥

నహి త్వాం ప్రాకృతం మన్యే వానరం వానరర్షభ ।
యస్య తే నాస్తి సంత్రాసో రావణా న్నాపి సంభ్రమః ॥

అర్హసే చ కపిశ్రేష్ఠ మయా సమభిభాషితుం ।
యద్యపి ప్రేషిత స్తేన రామేణ విదితాత్మనా ॥

ప్రేషయిష్యతి దుర్ధర్షో రామో న హ్యపరీక్షితం ।
పరాక్రమ మవిజ్ఞాయ మత్సకాశం విశేషతః ॥

దిష్ట్యా చ కుశలీ రామో ధర్మాత్మా సత్యసంగరః ।
లక్ష్మణశ్చ మహాతేజా స్సుమిత్రానందవర్ధనః ॥

కుశలీ యది కాకుత్స్థః కిం ను సాగరమేఖలాం ।
మహీం దహతి కోపేన యుగాంతాగ్నిరివోత్థితః ॥

అథవా శక్తిమంతౌ తౌ సురాణామపి నిగ్రహే ।
మమైవ తు న దుఃఖానా మస్తి మన్యే విపర్యయః ॥

కచ్చి న్నవ్యథితో రామః కచ్చి న్న పరితప్యతే ।
ఉత్తరాణి చ కార్యాణి కురుతే పురుషోత్తమః ॥

కచ్చి న్నదీన స్సంభ్రాంతః కార్యేషు చ న ముహ్యతి ।
కచ్చి త్పురుషకార్యాణి కురుతే నృపతే స్సుతః ॥

ద్వివిధం త్రివిధోపాయ ముపాయమపి సేవతే ।
విజిగీషు స్సుహృ త్కచ్చి న్మిత్రేషు చ పరంతపః ॥

శ్లో॥ కచ్చి న్మిత్రాణి లభతే మిత్రై శ్చా వ్యభిగమ్యతే ।
కచ్చి త్కల్యాణమిత్రశ్చ మిత్రైశ్చాపి పురస్కృతః ।

కచ్చి దాశాస్తి దేవానాం ప్రసాదం పార్థివాత్మజః ॥
కచ్చి త్పురుషకారం చ దైవం చ ప్రతిపద్యతే ॥

కచ్చి న్నవిగతస్నేహః ప్రవాసా న్మయి రాఘవః ।
కచ్చి న్మాం వ్యసనా దస్మా న్మోక్షయిష్యతి వానర ॥

సుఖానా ముచితో నిత్య మసుఖానా మనోచితః ।
దుఃఖ ముత్తర మాసాద్య కచ్చి ద్రామో న సీదతి ॥

కౌసల్యా స్తథా కచ్చిత్సుమిత్రాయా స్తథైవచ ।
అభీక్ష్ణం శ్రూయతే కచ్చి త్కుశలం భరతస్య చ ॥

మన్నిమిత్తేన మానార్హః కచ్చిచ్ఛోకేన రాఘవః ॥
కచ్చి న్నాన్యమనా రామః కచ్చి న్మాం తారయిష్యతి

కచ్చి దక్షౌహిణీం భీమాం భరతో భ్రాతృవత్సలః ।
ధ్వజినీం మంత్రిభి ర్గుప్తాం ప్రేషయిష్యతి మత్కృతే ॥

వానరాధిపతిశ్శ్రీమాన్ సుగ్రీవః కచ్చిదేష్యతి ॥
మత్కృతే హరిభి ర్వీరై ర్వృతో దంత నఖాయుధైః ॥

కచ్చిచ్చ లక్ష్మణ శ్శూర స్సుమిత్రానందవర్ధనః ।
అస్త్రవి చ్ఛరజాలేన రాక్షసా న్విధమిష్యతి ॥

రౌద్రేణ కచ్చి ద స్త్రేణ జ్వలతా నిహతం రణే ।
ద్రక్ష్యా మ్యల్పేన కాలేన రావణం ససుహృజ్జనమ్ ॥

శ్లో॥ కచ్చిన్నతద్ధేమసమానవర్ణం।తస్యాననం పద్మసమానగంధి,
మయా వినాశుష్యతి శోకదీనం। జలక్షయేపద్మమివాతపేన॥

ధర్మాపదేశా త్త్యజతశ్చ రాజ్యం ।
మాం చాప్యరణ్యం నయతః పదాతిం ।

నాసీద్వ్యథా యస్య న భీర్న శోకః ।
కచ్చి త్సధైర్యం హృదయే కరోతి ॥

న చాస్య మాతా న పితా చ నాన్య ।
స్స్నేహా ద్విశిష్టోఽ స్తి మయా సమో వా ।

తావ త్త్వహం దూత జిజీవిషేయం ।
యావ త్ప్రవృ త్తిం శృణుయాం ప్రియస్య ॥

ఇతీవ దేవీ వచనం మహార్థం ।
తం వానరేంద్రం మధురార్థ ముక్త్వా ।

శ్రోతుం పున స్తస్య వచోఽభిరామం ।
రామార్థయు క్తం విరరామ రామా ॥

సీతాయా వచనం శ్రుత్వా మారుతి ర్భీమవిక్రమః ।
శిర స్యంజలి మాధాయ వాక్య ము త్తర మబ్రవీత్ ॥

